# వాస్తు కౌముది - తృతీయభాగము

## 1. వృక్షములు

వృక్షములు మానవుల మనుగడకు ఆధారమైనవి. అవి మనము విడుచు బొగ్గుపులుసు వాయువును గ్రహిస్తాయి. శుద్ధమైన ప్రాణవాయువును అనుగ్రహిస్తాయి, వృక్ష సంపద వల్లనే వర్షాలు కురుస్తాయి.

ముఖద్వారానికి, ఎదురుగా లేని విధంగా ఇంటిచుట్టు స్థలం అధికంగా ఉన్నచో ఈ క్రింది ప్రసిద్ధ వృక్షములను పెంచవచ్చును.

సర్వత్ర కేసరాశ్చూతాః పున్నాగ నాగదాధిమాః ।
పనసాశ్చంపకాః పూగానారికేళాశ్చశోభనాః

**భావము:** కేసరములు (= పొగడచెట్లు) మామిడి చెట్లు - సురపొన్న చెట్లు - సర్వాక్షి చెట్లు - (సుగంధ సర్వాక్షి) - దానిమ్మ చెట్లు - పనసచెట్లు - సంపంగి చెట్లు - పోక చెట్లు - కొబ్బరి చెట్లు, గృహావరణములో పెంచడానికి ప్రశస్తములు అగును.

**వజ్రమతమున మరికొన్ని వృక్షములు ఇట్లు గలవు.**

పున్నాగ శోక తిలక శమీ వకుళ చంపకాః ।
దాడిమీ పిప్పళీ ద్రాక్షా - పిచుమందా భయంమరాః
బంధూక - పూగపనస - సరోజ - గృహమల్లికాః
మల్లికా పాటలీజాతీ నారికేళాస్త్రణద్రుమాః
ఏత గృహాంగణేవృక్షా సర్వదా మంగళప్రదా.

**భావము:** పొగడ చెట్లు - అశోకవృక్షములు - తిలకవృక్షము (= గోరింట చెట్టు - ఎఱ్ఱగోరింట చెట్టు) జమ్మిచెట్టు - వకుళవృక్షము - సంపెంగ చెట్లు, దానిమ్మ చెట్లు - పిప్పళిచెట్లు - ద్రాక్షచెట్లు - వేపచెట్లు - తిప్పతీగలు - గణికె - మంకెనచెట్లు - పోకచెట్లు - పనసచెట్లు - పద్మములు - గృహమల్లెలు, మల్లెలు - కలిగొట్టు చెట్లు - జాజిపూల చెట్లు - కొబ్బరి చెట్లు - మూలికారూపములైన - తృణముల చెట్లు - (దర్భలు - దొండ మొదలైనవి) గృహాంగణములో పెంచడం శుభదాయకము.

**విశేషము** – 1. ఇందులో - పొగడ - సంపెంగ - దానిమ్మ - పోక - పనస - కొబ్బరి అనెడి చెట్లు - పూర్వము చెప్పబడినవియే అగును - తక్కిన అశోక - తిలకశమీ - వకుళదులు క్రొత్తవి అగును.

2. తృణ వృక్షములు అనే పదానికి - ఇటుల నిర్వచనం చేయుదురు.

తృణాఖయం పిత్తజిద్ దర్భ - శర - ఇక్షుశాలిభిః అనే ధన్వంతరి నిఘంటువును అనుసరించి పైత్యమును హరించే, దర్భ - కాకి వెదురు - రెల్లు, చెఱకు - సంభాసైరు - అనే అయిదును తృణ పంచకముగాను - వీటి ఉపయోగాన్ని సైతము ఇలా తెల్పినారు - తత్కషాయం జ్వరహారం హిక్కాశ్వాస నివారణమ్.

**భావము:** ఈ తృణ పంచకము యొక్క కషాయము - ఎక్కిళ్లను - శ్వాసరోగమును అనగా ఊపిరి తిత్తుల రోగమును హరిస్తుంది.

మరికొందరు శాస్త్రకారులు - ఈ క్రింది వృక్షాలను సైతము పేర్కొన్నారు.

స్థాప్యా మందిర పార్శ్వ పృష్ఠదిశయ శ్రీవృక్షబిల్వాభయ -
వ్యాధిఘ్నానులకే సురద్రుమ పలాశాశోక మామలేయకాః
పున్నాగా నవచంపకాశ్చ - ఖదిరస్తద్వత్కదల్యాదయో
జితీనాగలతాదయోపి సకలాః సర్వత్ర సంశోభనాః

**భావము:** గృహముఖద్వారమునకు ఎదురుగా వృక్షములు ఉండరాదు. తులసి కోటను మాత్రము శాస్త్రకారులు అంగీకరించారు. ప్రక్కలను వెనుకను - స్థలాన్నిబట్టి - శ్రీవృక్షము (చీలి చెట్టు) మారేడు - వట్టివేరు - రేలచెట్టు - ఉసిరిక చెట్టు - దేవదారు చెట్టు, మోదుగ, అశోకము, ఏలకుల చెట్టు - పొన్నచెట్టు - అసవము (చిన్న ఉసిరిక) - సంపెంగ - చంద్ర - అరణి - జాజి - తమలపాకు (తీగ చెట్టు) మొదలైనవి ఉన్నచో ఇంటికి శోభనుగల్గిస్తాయి.

**వివరణ:** ఇట్లు - అభిప్రాయభేదములతో శాస్త్రకారులు చాలా వృక్షాలను - అంగీకరించారు. కాని ఫలవృక్షాలైన - సీతాఫలం - జామ - వెలగ - సపోట - రామాఫలములను వాస్తుశాస్త్రకారులు ప్రస్తావించలేదు. కంటక వృక్షాలలో ఫలజాతులైన బత్తాయి - నారింజ - కమలాఫలము - నిమ్మ - దబ్బ మొదలైన వృక్షాలు సైతం ప్రస్తావింపబడలేదు, కంటక ఫలవృక్షాలలో ఒక్క దానిమ్మ మాత్రమే గృహావరణలో ఉంచుటకు అంగీకరింపబడింది. అటుల అంగీకరింపబడుటకు హేతువు దానిమ్మ చెట్టు మూలికావృక్షమగుటయే .

సమీప జాగ్రతాశ్చతథావర్జ్యాః కంటకినోద్రుమాః
(విష్ణు ధర్మోత్తరము)

**భావము:** ఇంటి ఆవరణలోనే గాక ఇంటి సమీపము నందు ఉన్నను కంటకవృక్షాలు తొలగింపదగినవి.

కంటక వృక్షాలు = ముండ్లు కల్గిన చెట్లు - రేగు - తుమ్మ వంటివి.

శాస్త్రకారులు - ఇటుల కంటక వృక్షాలను అనగా ముండ్లు గల్గిన చెట్లను - గృహావరణమునందును, గృహపరిసరాల యందు నిషేధించడానికి కారణము సూక్ష్మంగా పరిశీలిస్తే ఇటుల తెలియగలదు - ఇంటిలో శిశువులు ఉందురు. శిశువులు ప్రమాదవశమున చెట్ల వద్దకు పోదురు. వృక్షములను తాకడం వలనగాని - ఇతర విధంగా గాని ముండ్ల వలన బాధను పొందగలరు. మరియు గాలి కారణంగా విరిగిన కొమ్మల ముండ్లు ఆవరణంలో అంతటను చేరగలవు. అప్పుడు ఆవరణలో తిరుగడమే కష్టంగా తయారు అగును - ఇటువంటి కారణాలను అనుసరించియే కంటకవృక్షాలను నిషేధించి ఉంటారు.

ఇక దానిమ్మ చెట్టు విషయము - దీనిముండ్లు - మందంగా - ఉంటాయి. అందుచే రాలి క్రిందపడవు. మరియు తుమ్మచెట్లకు వలె, రేగుచెట్లకు వలె ముండ్లు అధికంగా ఉండవు. ఈ కారణంచే ఇంటి ఆవరణం అంతటను వ్యాప్తిస్తాయి అనే భయం లేదు. అన్నింటికి మించి దానిమ్మచెట్టు మిక్కిలి అవసరమైన మూలికావృక్షంగా ఉంది - ఇటుల పలు విధాలుగా పరిశీలించి శాస్త్రకారులు కంటక వృక్షమైనను దానిమ్మ చెట్టును అంగీకరించియుందురు. కొందరు శాస్త్రకారులు దిక్కుల బట్టియు వృక్షనిర్ణయాన్ని ఇలా చేసినారు.

పనసః ప్రాచ్యాంశ్రేష్ఠః క్రమకో యామ్యేథ పశ్చిమేకేరంః
సౌమ్యే చూతో ధన్యో నాగస్త్ర త్రైవ, కేసరః ప్రాచ్యామ్ ।
తింత్రిణీ రుదితా యామ్యేభత్రీ శ్రేష్ఠోహిదక్షిణేభాగే ॥

**భావము:** తూర్పున పనసచెట్టు - కేసరపు చెట్లు =(పొగడచెట్లు). దక్షిణమున పోకచెట్లు, చింతచెట్లు - పశ్చిమమున కొబ్బరిచెట్లు - సదాపచెట్లు - ఉత్తరమున మామిడిచెట్లు - సర్వాక్షి చెట్లు ఉండుట ప్రశస్తము.

**విశేషము:** ఇచ్చట పూర్వవృక్షాలకంటే - అధికంగా చింతచెట్టు - ఒకటి అధికంగా పేర్కొనబడింది. మహారాజా మొదలుకొని బీదవాని వరకు అందరికిని ఉపయోగపడేది చింతపండు. ఉప్పు తర్వాత అందరు ఉపయోగించే ఆహార వస్తువులలో ముఖ్యమైనవి పుతలుపు, కారము - అనే రెండు మాత్రమే అగును - పుల్లదనానికై అన్ని కూరలలో ముఖ్యంగా వాడబడేది చింతపండు అని అందరికిని తెలియును, దీని చిగురును పప్పులోను - పచ్చడిలోను ఉపయోగిస్తారు, నిత్యము అనగా ఫలవృక్షాలవలె - నిత్యము పోషించవలసినదియుగాను, అయిదారు వందల సంవత్సరాలకు మించియు ఈ చెట్లు జీవిస్తాయి. మానవుల వలన ఏ సహాయం పొందకయే చిరకాలం సాయపడే వృక్షాలలో చింతచెట్టు మొదటిది. దీని తర్వాత గణింపదగినది తాటి చెట్టు అగును. అయితే తాటి చెట్టుకు కొమ్మలు ఉండవు. మరియు అది త్వక్సారవృక్షము - చింత చెట్టుకు కొమ్మలు ఉండును. సర్వతఃసారము అనగా లోపలను వెలుపలను సారముగలది. అందువలనే తొందరగా విరిగిపడదు.

**వృక్షముల విభజన**

వృక్షజాతిని నాల్గు విధాలుగా శాస్త్రకారులు విభజించారు.

1. అంతఃసారములు = లోపల గట్టితనము గల్గినవి - లోపల చేవగల్గిన టేకు = ఇనుమద్ది = చంద్ర - మొదలైనవి ఈ తెగకు చేరును.
2. బహిఃసారములు = వెలుపల గట్టితనము గలవి - తాటి, ఈత మొదలైనవి. అనగా చర్మసార వృక్షములు ఈ జాతికి చేరును. ఈ వృక్షాలనే త్వక్సారవృక్షములు అనియు అందురు త్వక్ = చర్మము.
3. ఉభయసారములు - లోపలను, వెలుపలను గట్టితనము గల్గినవి, మామిడి, వేప మొదలైనవి.
4. నిస్సారములు = లోపలను, వెలుపలను గట్టితనము లేనివి. అరటి, మునగ మొదలైనవి.

ఈ వృక్షముల విషయమై శిల్పరత్నము - అనే గ్రంధములో ఇట్లున్నది.

అంతః సారావృక్షా దయసన్తిహ్యాంతరేవ సంత్వపితే ।
యేసన్తి త్వచిసారాస్తేచ సంత్యేప సర్వతో బాహ్యే,
సకలం సారంయేషాంతే వృక్షాః సర్వదిక్షుయుజ్యన్తామ్,
వృక్షా నిస్సారాశ్చేత్తేషాంత్రేషువర్తనం నేష్టమ్ ॥

**భావము:** అంతస్సారములైన వృక్షాలు, యింటియొక్క ఆవరణములోపలనే ఉండవచ్చును, బహిఃసారములైన వృక్షములు అనగా చర్మసారములైన - టెంకాయచెట్లు, తాటిచెట్లు మొదలైన చెట్లు గృహాంగణమునకు వెలుపలనే ఉండవలయును. ఉభయసారములు (సర్వసారములు) అనగా లోపలను బయటను గట్టితనము గల్గిన చెట్లు - గృహప్రాంగణములో సర్వదిక్కుల యందును ఉండవచ్చును, ఇక నిస్సారాలైన వృక్షాలు - గృహప్రాంగణంలో గానీ వెలుపలగానీ ఉండరాదు.

**విశేషము:** ఇది సామాన్య నియమమేగాని - అవశ్య విధినియమముగాదు - ఏలననగా - పూర్వము టెంకాయచెట్టు - ఉండవచ్చునని ప్రత్యేకముగా తెల్పబడినది. అది చర్మసారవృక్షమైనను, ఇంటిలో ఉండవచ్చును.

ఇటులనే మునగ (ములగ), అరటి చెట్లును నిస్సార వృక్షములైను - శిష్టాచారమును బట్టి ఇంటిలో ఒకటి రెండు ఉండుటలో దోషములేదు.

ఈ వృక్షములు విరుగడం వలనగానీ, పూర్తిగా పడిపోవడం వలనగానీ, ఇంటికి అపాయం గల్గదు. వైద్య శాస్త్రమునను సరించియు మునగ, అవిసె, అరటి చెట్లు, ఇంటి ఆవరణలో ఉండుట దోషము గాదు.

అరిష్టపదానికి, వేపచెట్టు కొందరు వాస్తుశాస్త్రకారులు అరిష్ట వృక్షమును ఇంటిలో ఉండదగిన దానినిగా పేర్కొన్నారు. ఇతరములైన - కూకుడు చెట్టు (కుంకుడు చెట్టు) అని రెండు అర్థాలు గలవు. ఇందులో వేప చెట్టు యొక్క నీడయు, ఆరోగ్యగుణాలు - అందరికిని పరిచితములే అగును. ఇక కూకుడు కాయల చెట్టు విషయము అంత ప్రసిద్ధముగాదు. అది అడవి మరియు వేప చెట్టువలె, కూకుడు చెట్టు (కుంకుడు చెట్టు) గ్రామీణ వృక్షముగా ప్రసిద్ధముగాదు. చెట్టుగానే ప్రసిద్ధినిగాంచింది. అయినను దానికాయలు మాత్రము స్నానానికి మిక్కిలి ఉపయోగపడతాయి.

ఇటువంటి సందిగ్ధ సందర్భాల విషయంలో శాస్త్రకారులు, ఒక అందమైన తీర్పును బోధించారు. ఇట్లు - సందిగ్ధమైన వృక్షము ఇంటిలో ఉన్నచో - మరియు ఉపయోగకరంగా తోచినచో, దాని ప్రక్కన శుభములుగా - నిశ్చితములైన - దానిమ్మ, పనస, టెంకాయ వంటి వృక్షాలు ఒకటో రెండో ఉండేటట్లు వేసినచో ఏ దోషం గల్గదు, అని.

**ఇతర శాస్త్రబోధిత వృక్షాలు**

తులసి చెట్టు విషయాన్ని వాస్తు శాస్త్రకారులు వ్రాయలేదు. అది అందరికిని తెలిసిన విషయం అని వ్రాయలేదు - ధర్మశాస్త్రకారులు - వైద్యశాస్త్రవేత్తలు తులసి చెట్టును పూజావృక్షముగా గాను, ఆరోగ్యదాయకవృక్షంగా గాను - బహుధా ప్రస్తుతించారు. తులసి చెట్టు యొక్క - ఆకులకు - విత్తనాలకు - వ్రేళ్ళకు - కాడలకు - ఇటుల ప్రతి అవయవానికి ఉండే ప్రయోజనాలను విపులంగా పేర్కొన్నారు. అందుచే ఇంటిలో వసతిని బట్టి ఎన్ని తులసి మొక్కలను అయిననూ పెంచవచ్చును. ఇతర వృక్షాలు - ద్వారమునకు ఎదురుగా ఉండరాదు - అనే నియమంగలదు. కాని తులసిచెట్టుకు అట్టినియమం ఏదియును లేదు - స్థలం ఉన్నచో ముంగిటగానీ, పెరటిలో గానీ తులసీ కోటనే కట్టించుకొన వచ్చును. వాకిలికి ఎదురుగాను ఉండవచ్చును.

ఇక రెండవది - కరివేపాకు చెట్టు - ఇదియు ప్రసిద్ధంగానే భావించి వాస్తు శాస్త్రకారులు ప్రత్యేకంగా ఉల్లేఖించలేదు, అని తోచును. ఇది అంతగా బరువైన వృక్షం గాదు. దీని వలన అనగా విరిగి పడడం వలన ఇంటికి కీడు గల్గదు, వాత్స్యాయన మహర్షి, తన కామశాస్త్రములో గృహిణీ ధర్మప్రబోధ సందర్భమునందు ఈ వృక్షమును గూర్చి ఉల్లేఖించాడు.

గృహిణి, తన యింటి పెరటిలో పెంచవలసినకూరగాయలు మొదలైన చెట్ల పట్టికలో ఈ కరివేపాకు చెట్టును సైతం చేర్చాడు. వైద్య శాస్త్రరీత్యా కరివేపాకునకు ఎంతయో ప్రాముఖ్యం గలదు.

**కానుగు చెట్టు విషయము:** ఇది సర్వతః సారమైన అనగా లోపలను వెలుపలను గట్టితనము గల్గిన చెట్టు. అయినను ప్రత్యేకంగా పేర్కొనబడలేదు. కంటక వృక్షమునుగాదు దీని నీడ, గాలి మిక్కిలి ప్రశస్తాలు. వైద్యశాస్త్రరీత్యా మిక్కిలి ఉపయోగకరంగా స్తుతింపబడినది. కోరింత దగ్గు గల్గిన బిడ్డల మెడలకు దీని కాయలను కట్టడం పల్లెలలో నేటికిని ఆచారంగా ఉంది. సర్వతః సారముగనుక సామాన్యనియమాన్ని బట్టి అనగా - 'సర్వతః సారాః సర్వత్రసంతు' - అనే పూర్వోక్త సూక్తిని అనుసరించి గృహావరణంలో గాని కాంపౌండును దాటి రోడ్డు దగ్గరగాని ఉండడంలో దోషం లేదు.

**గులాబి పూల చెట్టు:** దీని ప్రస్తావనయు వాస్తు శాస్త్రములో నాకు తెలిసినంతవరకు లేదు. ఇది పూలమొక్కలలో చేరినది. అయితే కొంతవరకు కంటక వృక్షమే అగును. ప్రాచీనులు దీనిని ప్రస్తావించక పోవుటకు కారణము. వారి కాలములో ఇది లేదేమో అనియు కొందరు అందురు గులాబీ లేహ్యము - అనగా గులాబీ పూలు ప్రధాన వస్తువుగాగల లేహ్యము - మలబద్ధ నివారకముగా ఆయుర్వేదంలో ప్రసిద్ధమై ఉంది. అందుచే ప్రాచీన కాలంలో లేదు అనడం సరిగాదు అని తలంపదగును. శిష్టాచార ప్రసిద్ధం గనుక ఇంటిలో స్థలాన్ని బట్టి పెంచవచ్చును.

**గన్నేరు చెట్టు:** ఇది తెల్ల గన్నేరు, ఎఱ్ఱగన్నేరు ఇత్యాదిగా ఎన్నియో భేదాలతో ఉంది. ఇది పూజా వృక్షంగా పరిగణింపబడింది. శిష్టాచార సిద్ధము అందుచే ఇంటి ఆవరణలో స్థలాన్ని బట్టి ఉండవచ్చు.

**బాదము చెట్టు:** ఇదియు కంటక వృక్షము గాదు. దీని ఆకులను విస్తర్లుగా కుట్టి వాటి యందు భుజించడం సైతం ఆచారంగా ఉంది, దీని కాయలను పగులగొట్టి లోపలి పప్పును పిండివంటలయందును, శీతల పానీయాదులయందును ఉపయోగిస్తారు. ఇది మఱ్ఱిజువ్వి మొదలైన వృక్షాల మాదిరి శాఖోపశాఖలుగా విస్తరించునదియును గాదు. అందుచే గృహానికి అపాయకరము గాదు. నేడును ఆచారవంతులైన శ్రోత్రియుల గృహాలలో ఈ చెట్టు పెంచబడుతూనే ఉంది. ఆకులు పెద్దగా ఉంటాయి. అందుచే కొంతవరకు ఛాయా వృక్షం సైతం అగును. శిష్టాచార సిద్ధమైన ఈ చెట్టును వసతిని అనుసరించి గృహావరణయందు పెంచడంలో దోషము లేదు.

**మోదుగు చెట్టు:** ఇది శ్రుతి సంస్తుతమైన వృక్షము, పెద్దగా పెరుగునట్టి వృక్షమే అగును. దీని కఱ్ఱలను సమిధలు అందురు. యాగాధులందు ఉపయోగిస్తారు. ఆకులు విస్తర్లుగా కుట్టి, అందు భుజిస్తారు. మోదుగాకుల విస్తర్లు మిక్కిలి ప్రసిద్ధాలు. ఇంటిమీదికి కొమ్మలు వ్యాప్తించని విధంగా ఈ వృక్షాన్ని పెంచడంలో దోషంలేదు. పాలాశేబ్రహ్మవర్చసమ్ అనే సూక్తిని అనుసరించి దీని దర్శనాదికము వలన బ్రహ్మజ్ఞాన తేజము వృద్ధినందును అనియు తలంపదగును.

**మఱ్ఱి – జువ్వి – రావి – మేడి – వృక్షములు:** ఈ నాల్గును క్షీరవృక్షాలు అగును. ఇందులో మొదటి మూడును అనగా మఱ్ఱి - జువ్వి - రావి అనేవి మాత్రం ఊడల ద్వారా బహుధావిస్తరించేవి అగును. మద్రాసునందలి అడయారులోని మఱ్ఱివృక్షము ప్రపంచ ప్రసిద్ధము - దీని మొదలే పాతిక ఎకరం స్థలాన్ని ఆక్రమించి ఉంటుంది. ఇక కొమ్మల ద్వారా చుట్టూ వ్యాపించిన స్థలము దాదాపు రెండు ఎకరములకు మించియే ఉండును. శాస్త్రకారులు 'క్షీరణోధననాశాయ' క్షీరవృక్షాలు ధన నష్టం గల్గిస్తాయి, అని సామాన్యంగా అన్నను - ఈ వృక్షాలను మాత్రం ప్రత్యేకంగా పేర్కొని ఇలా ప్రస్తుతించారు.

*పాలాశంబ్రహ్మస్య మశ్వత్థే రాజ్యభావనా!*
*సర్వభూతాధిపత్యంచ పక్షేనిత్యముదాహృతమ్!*
*పుష్టికామంచన్యగ్రోధం బుద్ధిం ప్రజ్ఞాం ధృతిస్మృతిమ్!*
(వాయుపురాణము)

**భావము:** మోదుగు చెట్టు బ్రహ్మతేజమును పెంపొందించును. రావి చెట్టు రాజ్యవృద్ధిని (అధిపత్యాన్ని) వృద్ధిచేస్తుంది. పక్షము అనగా జువ్విచెట్టు సర్వభూతాధిపత్యము గల్గిస్తుంది. ఇకమఱ్ఱి చెట్టు అయితే - పుష్టిని, బుద్ధిని - ధైర్యస్థైర్యాలను - జ్ఞాపకశక్తిని - అధికంగా వికసింపచేస్తుంది.

విశిష్టసంహితలో - ఈ వృక్షాలకు - దిశానియమం సైతం ఇటుల బోధింపబడింది.

*ప్లక్షకర్కంధు వృక్షేర్వాగృహస్యోత్తరతః శుభౌ!*
*న్యగ్రోధోదుంబరాశ్వత్థాః ప్రాగాదిషు శుభప్రదాః!!*

**భావము:** జువ్వి - రేగు - అనే వృక్షాలు రెండు ఇంటికి ఉత్తర దిక్కున శుభదాయకములు - మఱ్ఱివృక్షము తూర్పునందును మేడి చెట్టు దక్షిణమునందునను - రావి చెట్టు పడమటి దిక్కునను శుభదాయకములు అగును. ఇచ్చట పాఠకులకు ఈ విషయంలో ఇటుల సందేహంగల్గవచ్చును.

**సందేహము లేక ఆక్షేపము**

అయ్యా - క్షీరణోధననాశాయ - క్షీరవృక్షస్థితిచే ధనం నశిస్తుంది. కంటకినోరిపుభయదా = ముండ్ల చెట్లు శత్రుభయాన్ని గల్గిస్తాయి. ఫలినః ప్రజాక్షయకరాః = ఫలవృక్షలు సంతానాన్ని నశింపజేస్తాయి.

మొదలైన వాక్కులను అనుసరించి మఱ్ఱి, మేడి, జువ్వి వంటి ఫల వృక్షాలును రేగు, నిమ్మ వంటి కంటక వృక్షాలును - విడువదగినవియే అగును. అట్టి స్థితిలో తూర్పున మఱ్ఱిచెట్టు, ఉత్తరాన జువ్వి, రేగుచెట్లు - మొదలైన వాక్కులు ఎట్లు సరిపడును రెండింటికిని స్ఫుటంగా విరోధం గలదు గదా! అని ఆక్షేపము.

**సమాధానము**

మహర్షుల వాక్కులను తాము స్ఫుటంగా గ్రహింపలేదు - తూర్పునందు - మఱ్ఱిచెట్టు ఉండడం శుభం అన్నానే గాని - ఇంటి ఆవరణలో అని తెలుపలేదు. ఇంటికి తూర్పుదిక్కున కొంత దూరంలో అనగా చెట్టు కొమ్మలు - ఇంటి మీదికి రానంత దూరంలో అని తలంపవలయును - మఱ్ఱిచెట్టు పెద్దది అయినచో అర ఎకరాస్థలం వరకు శాఖోపశాఖలతో దాదాపు వ్యాపిస్తుంది - అని వెనక తెల్పినాము. అందరికిని అనుభవమైన విషయం గూడ. వాస్తవానికి చాల మందికి ఇంటి వైశాల్యమే అర ఎకరా ఉండడం అనేది అరుదైన విషయము. ఇట్టిస్థితిలో మఱ్ఱి చెట్టును ఇంటి ఆవరణలో పెంచడం సాధ్యంగాదు. చాలా వరకు మఱ్ఱి మొదలైన ఈ పాలవృక్షాలు - ఛాయా వృక్షాలుగా కీర్తింపబడినాయి - వేప - కానుగ వంటి వృక్షాలు గూడ నీడను ఇస్తాయి గాని - మఱ్ఱి - జువ్వి వంటి వృక్షాలవలె తొందరగా పెరిగి నీడను ఇవ్వలేవు. ఏలననగా - మఱ్ఱి - జువ్వి వంటి చెట్లను - విత్తనాల ద్వారా కంటె కొమ్మల ద్వారానే చాలమంది పెంచెదరు. అనగా కొమ్మలను తీసుకొనిపోయి నాటినచో, చిగుళ్ళువేసి త్వరలో పెద్దవృక్షాలై త్వరలో నీడను ఇస్తాయి. ఈ చెట్ల ఆకులు పెద్దగా సైతము ఉంటాయి. అందుచేతనే మఱ్ఱి ఆకులను విస్తర్లుగా కుట్టి అందు భుజిస్తారు. హోమాదులందు - మఱ్ఱి కట్టెలను సైతం ఉపయోగిస్తారు. ఈ మఱ్ఱి చెట్టు పురాణాదులందు దేవతావృక్షంగా కీర్తింపబడింది.

ప్రసిద్ధమైన ఈ ప్రార్థనాశ్లోకం పఠించండి.

> *కరారవిందేన పదారవిందం ముఖారవిందేవిని వేశాయన్తీమ్!*
> *వటస్య పత్రస్యపుటేశయానం బాలంముకుందం మనసాస్మరామి!!*

**భావము:** కమలం వంటి చేతితో, కమలం వంటి పాదమును పట్టుకొని పాదం యొక్క బొటనవ్రేలిని, కమలంవంటినోటిలో, ఉంచుకొనినవాడును - మఱ్ఱియాకునందు శయనించినవాడును, బాలుడును, అయిన శ్రీ కృష్ణుని, నిండు మనస్సుతో ధ్యానిస్తున్నాను.

దీనిచే శ్రీ మహావిష్ణువు వటపత్రశాయి అని తెలియుచున్నది - అట్టి యెడ మఱ్ఱిచెట్టు దేవతావృక్షము అనడంలో ఎంతయో ఔచిత్యంగలదు.

ఇందులకు ఇంకొక రమ్యమైన ఉదాహరణ-

> **శ్లో॥ న్యగ్రోధపత్రసమలాంక్రమతః ప్రయాతాం**
> **అంగీచకారపున రప్యుదరంకృశాంగ్యాః॥**
> **జీవాలవేదశముఖోరగపేడితానాం**
> **గర్భశ్చలేనవసతా ప్రధమే వపుః॥ సా॥**

(చంపూరామాయణము - భోజరాజు)

**భావము:** కౌసల్య గర్భమును ధరించినది - క్రమంగా గర్భం ప్రవర్ధమానం అగుచున్నది. గర్భధారణకుముందు ఆమె ఉదరము (పొట్ట) మఱ్ఱియాకువలె పలచగా సన్నగా ఉండేది - ఇప్పుడు గర్భప్రవర్ధమానతచే మఱ్ఱియాకు యొక్కపోలిక అనగా సన్నగా ఉండడం అనేది ఉదరానికి లేదు అనియే పరిమాణరీత్యా తలంచవలసి ఉండును. కాని గర్భంలో ఉండేవాడు, ఆదిపురుషుడైన శ్రీమన్నారాయణుడు, ఆదిపురుషుడును, ధర్మరక్షకుడును అయిన ఆ మహావిష్ణువటపత్రశాయి. అందుచేలావుగా ఉండిననూ కౌసల్యయొక్క ఉదరమునకు మరల వటపత్ర సామ్యతను అంగీకరింపవలసియే ఉండును!

ఈ వర్ణన మిక్కిలి మనోజ్ఞముగా ఉంది.

ప్రసిద్ధమైన శ్రీ చిలకమర్తి వారి గయోపాఖ్యాన పద్యము. పండితపామరుల కందరకును కంఠస్థముగానే ఉండునని తలంతును - ఆ పద్యమునందలి కొంతభాగము.

> దీ॥ పాతాళమునకేగి బ్రతుకవచ్చునటన్న
> బలిచక్రవర్తి నన్ బట్టియిచ్చు
> వనధిలోపలదాగి - కానవచ్చుననుకొన్న
> వటపత్రశాయియై అటవసించు.

**భావము:** గయుడు శ్రీ కృష్ణుని వలన ప్రాణాపాయభయమును తొలగించుకొనే మార్గముకై ఇలా విచారిస్తున్నాడు.

పాతాళలోకానికి పోయి ఏదోవిధంగా బ్రతుకుటయును సాధ్యముగాదు - విష్ణు భక్తుడైన బలిచక్రవర్తి నన్ను బంధించి కృష్ణునికి అర్పిస్తాడు - ఇక సముద్రములో దాగుండడంవల్లను ఉపయోగం లేదు. శ్రీ కృష్ణుడు - వటపత్రశాయియై సముద్రమునందే ఉన్నాడు - ఇత్యాదికము. దేవతానివాసమైన మఱ్ఱిచెట్టు, రాక్షసనివాసముగాను, విక్రమార్కచరితాదులందు కీర్తింపబడింది ఫలవృక్షానికే రాళ్ళదెబ్బలు - అన్నవిధంగా మంచి ఉన్నచోటనే చెడ్డయు ఉంటుంది. అయినను మంచిని అనుసరించి గ్రహింపవలసియేయుండును.

## అశ్వత్థవృక్షము - రావిచెట్టు

భగవద్గీతలో - గీతాచార్యుడు - అశ్వత్థః సర్వవృక్షాణామ్ (వృక్షములలో అశ్వత్థవృక్షము నా స్వరూపము) అన్నాడు. ఇక సంసారమే అశ్వత్థవృక్షంగా పంచదశాధ్యాయంలో ఇలా ప్రస్తుతింపబడింది.

> ॥-ఊర్ధ్వమూల మధఃశాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్।
> ఛన్దాంసి యస్యపర్ణాని యస్తంవేద సవేదవిత్॥
> కఠోపనిషత్తునందును కొంత మార్పుతో ఇట్లున్నది
> ఊర్ధ్వమూల అధఃశాఖ ఏషోశ్వత్థః సనాతనః

**భావము:** పరబ్రహ్మము మూలముగా గలదియు - మహదాధికమైన ఏడును ప్రకృతి వికృతులుగా గలదియు, అయిన ఈ సంసారము అనే అశ్వత్థవృక్షము సనాతనమైనది అనగా ఆద్యంతాలు లేనిది అగును.

వైయాకరణులు అశ్వత్థసంసార పదాలకు దీనిని అనుసరించియే ఇలా నిర్వచనం చేస్తారు.

**అ-శ్వ-త్థః** శః ఏవంరూపేనతిష్ఠతీ అశ్వత్థః పృషోదరాదిత్వాత్ సకారలోపః రేపు ఈ విధంగా ఉండదు - అనగా వృద్ధిని పొందుతుంది - గనుక అశ్వత్థము - పృషోదరగణ పఠితమును అగుటచే - స్థాధాతువునందలి సకారమునకు లోపము.

సంసార పదనిర్వచనము:

యశ్చాత్మభేదవానస్తి సోనాత్మేతిహి లక్ష్యతే,
అనాత్మైవహిసంసారః ప్రకృతిశ్చేతి కథ్యతే,
సంసరణాద్ధి సంసారః ప్రకృతిః ప్రకరోత్యతః॥
(ప్రణవవాద దీపికా - ప్రథమోధ్యాయం: శ్రీ యోగానన్దయతిః)

**భావము:** ఆత్మభిన్నమైనది అనాత్మ అని తెలియదుగును - అనాత్మయే సంసారము అనియు ప్రకృతి అనియు తలంపదగును. సంసరణం వలన - అనగా ప్రాకుతూ పెరగడం వలన సంసారం అనబడును - ప్రకర్షగా అనగా అధికంగా మహదాదిరూపంగా విస్తృతిని పొందడం వలన (చేయడం వలన) ప్రకృతి అనబడును.

భగవద్గీతలోని - అశ్వత్థవృక్ష నిర్వచనానికి ఈ సంసార - ప్రకృతి శబ్దనిర్వచనాలకు భేదంలేదు అని విజ్ఞులు తేలికగా గ్రహింపగలరు!

ప్రకృతికి పరమాత్మకు భేదం లేదు. సృష్టిని అపరా ప్రకృతియనియు. దానిని ధరించే దానిని పరాప్రకృతి అనియు రెండును ఈశ్వరాంశలు లేక పరమాత్మ స్వరూపములు అనియు భగవద్గీత బోధిస్తున్నది. అందుచే అశ్వత్థదర్శనము వలన రాజ్యభావన అనగా ఆత్మరాజ్య భావన - స్వరాజ్య భావన, జనించడంలో ఎంతయో ఔచిత్యం గలదు. అయితే గృహప్రాంగణంలో మాత్రం దీనిని పెంచడం సాధ్యం గాదు. వెలుపల ఉండదగును. శాస్త్రకారులు, ఉత్తర దిశను పేర్కొనడం సైతం జ్ఞానహేతువుగా తెలియదగును.

ఇటులనే జువ్వి, మేడి చెట్ల విషయమును తెలియదగును. వివాహాదులందు - జువ్వి, మేడి చెట్ల కొమ్మలను తెచ్చుటయును. వాటి సంబంధకఱ్ఱలతో అనగా పచ్చికఱ్ఱలతో పీటలు చేసి వధూవరులను ఆ పీటలపై కూర్చుండజేయడం సైతం పూర్వం ముఖ్యమైన ఆచారంగా ఉండేది.

ఏమైనను, ఇవి అన్నియు గ్రామ్య వృక్షాలు. శుభప్రదములు - వసతిని బట్టి ఇంటికి వెలుపల ఉండవచ్చును. ఛాయవృక్షాలు అగుటచే పుణ్యకాంక్షులు - ఈ వృక్షాలను పెంచడమే గాక. వీటికింద కూర్చుండడానికి అరుగులు ఏర్పాటు చేయడం ఆచారంలో గలదు.

ఇటుల వృక్షాలను విమర్శిస్తూ పోయినచో - వాస్తు శాస్త్రానికి బదులు వృక్షశాస్త్రంగా ఈ గ్రంథం అగును. అందుచే ఈ చర్చను ఇంతటితో ముగింతును. ఏదేని నిషిద్ధవృక్షంగా తోచినచో దానికి దగ్గరగా శాస్త్రకారులు పేర్కొనిన వృక్షాలైన అశోక

పనసాదులలో ఒకటిగాని రెండుగాని పెంచినచో - నిషిద్ధ వృక్షదోషం పోవును అనియు తలంపదగును.

ఈ విషయమును బృహత్సంహితలో వరాహమిహిరుడు ఇటుల బోధించాడు.

ఛింద్యాద్యదిన తరూంస్తాన్
తదన్తరే పూజితావపేదన్యాన్ ।
పున్నాగాశోకరిష్ట
వకులపనసాన్ శమీశాలా ॥

**భావము:** నిందిత వృక్షాలను కొట్టడానికి వీలుగానిచో అట్టి వృక్షాల సమీపమునందు పూజ్యవృక్షాలను కొన్నింటిని పెంచినచో - ఆ దోషము తొలగును - పూజితవృక్షాలు కొన్ని ఇటుల పేర్కొనబడినాయి - పున్నాగము - అశోకము, వేపచెట్టు - వకుళీము - పనసచెట్టు - జమ్మిచెట్టు, మద్దిచెట్టు - మొదలైనవి.

**విశేషము:** కొట్టడానికి వీలుగాని యెడల అనుటచే - ఈ క్రింది అంశము స్ఫురిస్తూ ఉంది. ప్రక్కయింటి పెరటిలో, మన యింటి ప్రక్కగా - తుమ్మచెట్టు ఉన్నది అనుకొందాము. దానిని కొట్టుటకు మనకు అధికారము లేదు గదా అట్టి పరిస్థితిలో మన పెరటిలో దానికి సమీపమునందు శుభవృక్షములను పెంచినచో, నింద్యవృక్షదోషము తొలగును అని గ్రహింపదగును.

**మునగ చెట్టు** - ఇది నిస్సార వృక్షము అనగా చర్మసారము ఉండదు. అంతఃసారము సైతము ఉండదు - నిస్సారవృక్షాలు ఇంటిలో ఉండరాదు అనియే శాస్త్రకారులు అన్నారు. కాని ఇది కూరగాయల జాతికి చెందినది. శిష్టాచారముగా ఇంటి పెరటిలో పెంచబడుతున్నది. దీనివలన ఇంటికి అపాయంలేదు. దీని ప్రక్కన తులసిచెట్టును పెంచి, దీనిని పెంచవచ్చును.

ఇటులనే - చిక్కుడు, కాకర, దొండ వంటి కూరగాయల చెట్లు సైతము స్థలమును బట్టి ఇంటి ఆవరణలో పెంచవచ్చును.

గుమ్మడి - సొర - పొట్ల - వంటి కూరగాయల చెట్లు - అధికస్థలాన్ని ఆక్రమిస్తాయి. వీటి మధ్యన - పాములు మొదలైన విషజంతువులు చేరడానికి అవకాశముగలదు. అందుచే ఇంటి వెనుక ప్రత్యేకంగా పెరటితోట ఉన్నచో వీటిని పెంచవచ్చును. ముంగిట మాత్రము మంచిది గాదు. మరియు పొట్లకాయలు - పాములవలె క్రిందికి వ్రేలాడుతూ ఉంటాయి. కనుక రాత్రులందు వ్రేలాడే పాములకును, వాటికిని భేదం గుర్తించడం కష్టంగా ఉంటుంది.

ఈ విధంగా వృక్షాల విషయంలో వాస్తు శాస్త్రం అంతయును - వైద్యశాస్త్రాన్ని, ఆధ్యాత్మిక శాస్త్రాన్ని అధికంగా ఆధారంగా చేసికొన్నది అని గ్రహింపదగును. అందుచే శాస్త్రాలకు అన్నింటికిని పరస్పరము సమన్వయము గలదు అని తెలియదగును.

**వృక్షాల విషయంలో ఆధునిక వాస్తుశాస్త్రకారుల వింత భావనలు**

కేవలము వాస్తువు ఒక్కటి సరిగానున్నంత మాత్రాన అన్ని శుభాలు గల్గును. అన్ని పనులు నెరవేరును అనియు తలంపరాదు. అని వెనుక వివరింపబడింది. అయిననూ పాఠకుల సౌకర్యమునకై అందలి ముఖ్యాంశాలను ఉల్లేఖిస్తున్నా.

*పంచైతాని మహాబాహో కారణాని నిబోధమే ।*
*సాంఖ్యేకృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥*
*అధిష్ఠానం తథాకర్తా కరణంచపృథగ్విధమ్ ।*
*వివిధాశ్చపృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥*
*శరీర వాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః ।*
*న్యాయంవా విపరీతంవా పంచైతేతస్య హేతవః ॥*

*(భగవద్గీతా - అష్టాదశోధ్యాయం 13-14-15 శ్లోకాలు)*

**భావము:** ఓ అర్జునా! ఏ పని అయినా - ఆ పని మంచిది అయినా లేక చెడ్డది అయినా నిరాటంకంగా నెరవేరాలంటే - సాంఖ్య సిద్ధాంతంలో అయిదు కారణాలు నొక్కి వక్కాణింపబడినాయి అవియేవి అనగా -

1. అధిష్ఠానము - సుఖదుఃఖ భోగయుతమైన శరీరము
2. కర్తా - నేను కర్తను - నేను భోక్తను ఇత్యాదిగా సర్వత్ర అహంభావియైన చిదాభాసరూపుడగు జీవుడు.

3. పృథగ్విధం కరణమ్ - జ్ఞానేంద్రియాలు అయిదు. కర్మేంద్రియాలు అయిదు - మనస్సు, బుద్ధి అనేవి రెండు - ఇట్లు మొత్తము బాహ్యాభ్యంతరభేదముచే పంద్రెండు విధాలైన ఇంద్రియ సముదాయము.

4. వివిధా పృథక్ చేష్టాశ్చ = ఊర్ధ్వాదిభేదముచే దశవిధములైన వాయుచేష్టలు - అనగా ప్రాణాలు అయిదు, నాగాదులు అయిదు - కలసి మొత్తము పదివాయుచేష్టలు అని సారాంశము.

5. పంచమం దైవంచ = అయిదవదియైన దైవము - అనగా పూర్వకర్మానుసారం ఫలవిధాయకమైన అదృష్టము శరీరముచే, వాక్కుచే మనస్సుచే, మానవుడు ఏ పనిని ఆరంభించినను - ఆ పనిని మంచిది కాని లేక చెడ్డదిగాని నెఱవేఱవలయునన్నచో ఈ అయిదును కారణములు అగును.

ఇందును మొదటి నాల్గింటి కంటెను అయిదవదియైన దైవము, మిక్కిలి బలమైన హేతువు అగును! వండిన అన్నములో కుక్కలు, కాకులు, మూతులు, ముక్కులు ఉంచి అభోజ్యముగా చేయుటయు - పండిన పంటలు వరదల పాలు అగుటయు - పెండ్లి ప్రయాణాలు, యమలోక ప్రయాణాలు అగుటయు మొదలైనవన్నియును, దైవప్రతికూలత వల్లనే అని తెలియదగును. ఇటువంటి విషయాలలో మహామేధావులైన మానవప్రయత్నాలను ఎందుకును కొఱగానివైపోవుచున్నవి అనేది అందరికిని ప్రత్యక్షసిద్ధము. ఇట్టిస్థితిలో ప్రారబ్ధదోషమును అనగా దైవ ప్రతికూలతను - దానికి తగిన శాంతిని బోధించునదియే జ్యోతిష్యశాస్త్రము అగును. కాని నేటి ఆధునిక వాస్తుశాస్త్ర రచయితలు కొందరు. ఇంటిలో దైవప్రతికూలతచే సంభవించిన అశుభమునకును - వాస్తువునే హేతువుగా తెల్పుచున్నారు. మరియు ఆ - తెల్పేది వాస్తుసవరణయును శాస్త్రసమ్మతముగా ఉండదు.

ఈ శాస్త్ర పరిచయంలేని ఈ ఆధునికులు తెల్పేవాస్తు విషయాలు - ఇలా ఉంటాయి.

తూర్పున, ఉత్తరాన - ఇంటి ఆవరణలో టెంకాయ చెట్లు - మామిడి చెట్లు ఉన్నాయి. అందుచే మీ ఇంటిలో ధననష్టం గల్గుతూవుంది. సంతానం లేదు. ఈశాన్యంలో దేవునికి అరుగుకట్టినావు ఈశాన్యాన బరువు వచ్చింది. నైఋతిలో బరువులేదు. ఇటుల ఏవేవో పిచ్చిపిచ్చి కారణాలను తెల్పుచున్నారు.

ప్రాచీన వాస్తుశాస్త్రకారులు:-

**పనసః - ప్రాచ్యాంశ్రేష్ఠః = పనస చెట్టు తూర్పున శ్రేష్ఠము**
**సర్వత్ర కేసరాశ్చాలాః పున్నాగానుగ దాదికూః**

**భావము:** అన్నిదిక్కులందు కేసరములు - మామిడి చెట్లు సురపొన్నలు - నాగము (సర్పాక్షి దాదిమ వృక్షములు) ఇత్యాదిగా బోధించినారు. వీరి వ్రాతలకు ముఖ్యంగా బరువు అనే వాదానికి ఆధారం ఏమిటో తెలియదు. అనుభవంలోను - వీరి వాక్కును బట్టి వృక్షాలు కొట్టించిన వారికి శుభంగల్గుటయును లేదు, ఇక బరువు విషయంలో - వాస్తుపురుషునిమర్మవేధలేని విధంగా గోడలు - స్తంభాలు ద్వారాలు - ఇత్యాదులు ఉంచవచ్చును. అని వెనుక తెల్పినదానిని గుర్తింపదగును.

**సారాంశము:** వాస్తు శాస్త్రకారులు తమ వాస్తు శాస్త్రాల యందు గృహావరణలో ఉండదగిన కొన్ని వృక్షాలను గురించి తెలపినారు. మహర్షివాత్స్యాయనుడు. తన కామ శాస్త్రంలో సహధర్మిణీ చర్యయందు. పెరటిలో పెంచదగిన కూరగాయల చెట్లతో బాటు కొన్ని వృక్షాలను బోధించాడు. ఇదియంతయును పెరటి యొక్కయును, గృహావరణము యొక్కయును వసతిని అనగా స్థలమును బట్టియే ఉండును.

ఎంత ప్రశస్తవృక్షాలు అయినను - తొఱ్ఱలుపడివిషజంతువులు చేరడానికి అవకాశం గల్గించేవిగా ఉన్నచో వాటిని తొలగించడంలో దోషంలేదు.

ఉదయము సుమారు 9 గంటల ప్రాంతము నుండి దాదాపు 12 గంటల వరకు ఉండే మధ్యకాలంలో ఇంటిమీదికి అనగా పై భాగానికి నీడరాని విధంగా శాస్త్రబోధిత వృక్షాలు - మరియు శిష్టాచార సిద్ధాలు అయిన వృక్షాలు ఉండవచ్చును. ఇంటిమీదికి అనుటచే ఇంటి వసారాలోనికి నీడ వచ్చినను దోషంలేదు అని గ్రహింపదగును.

శాస్త్రకారులు తెలుపని వృక్షాలు ఏవేని గృహావరణలో ఉన్నచో, అవి ఉపయోగకరములుగా తోచినచో వాటి ప్రక్కన శాస్త్రబోధిత శుభవృక్షాలను పెంచినచో ఆ దోషంపోవును అని గ్రహింపదగును.

## 2. గృహోన్నతి - ఇంటియొక్క ఎత్తు - ప్రాథమిక విషయములు

1. ఇచ్చుట ద్వారము క్రింద ఉండే బండనుండి - ఇంటిలోపల దూలము క్రిందివరకు ఉండే కొలతను మాత్రమే ఇంటి ఎత్తు అని గ్రహింపవలయును. చిన్నగదిగా ఉండి దూలము లేనిచో - అనగా దంతెలు ఉన్నచో వాటి క్రింద భాగము వరకు గడపక్రింది నుండి ఎన్ని అంగుళములు ఉండునో గుర్తింపవలయును. దంతెలు సైతము ఉండనిచో అనగా సిమెంటు స్లాబ్ - ఇత్యాదికము ఉన్నచో, దాని క్రిందివరకు ఉండే అంగుళములను గుర్తింపవలయును.
2. అంతేగాని నేలనుండి ఇంటి పైకప్పు యొక్క పైభాగము వరకు ఉండే కొలతను గ్రహింపరాదు - అనగా పైకప్పు యొక్క మందమును కొలతలో చేర్చరాదు.
3. ఇట్లు ఉండే ఎత్తు యొక్క అంగుళములను ఎనిమిదిచే భాగించినచో శేషము, బేసి అంకెలై ఉండడము ఉత్తమము అగును. దీనిచే ఆయశుద్ధి గల్గును.

### ఆయ పరిచయము

ఆయములు ఎనిమిది గలవు

**ధ్వజోధూమ్రోహరిః శ్వాగైః ఖరేభౌ వాయసోష్టమః**

**భావము:** 1. ద్వజాయము, 2. ధూమ్రాయము, 3. సింహాయము, 4. శ్వానాయము, 5. వృషభాయము, 6. ఖరాయము, 7. గజాయము, 8. కాకాయము అని ఈ ఎనిమిది ఆయములకు పేర్లు.

**ప్రస్తుతాంశము:** పైన తెల్పిన ఎత్తును - ఎన్మిదిచే భాగించినచో ఒకటి మిగిలినచో ధ్వజాయము అనియు, రెండు మిగిలినచో ధూమ్రాయము అనియు, 3 మిగిలినచో సింహాయము అనియు, 4. మిగిలినచో శ్వానాయము అనియు, 5 మిగిలినచో వృషభాయము అనియు, 6 మిగిలినచో ఖరాయము అనియు, 7 మిగిలినచో గజాయము అనియు, 8 మిగిలినచో కాకాయము అనియు గ్రహింపదగును. వీటిలో బేసి సంఖ్యలైన ఆయములు అనగా, 1-3-5-7 అనే - ధ్వజ - సింహ - వృషభ - గజాయములు - నాలుగు ప్రశస్తములు - తక్కినవి అప్రశస్తములు అని తలంపబడును.

గృహము యొక్క వైశాల్యవిషయములో సైతము ఈ ఆయములే ఉండును - అయితే అచ్చుట వైశాల్యమును - 9చే హెచ్చించి 8 చే భాగింపవలసియుండును, పొడవుచే వెడల్పును గానిలేక వెడల్పుచే పొడవును గాను హెచ్చించినచో అనగా గుణించినచో వచ్చే లబ్ధమును వైశాల్యము అందురు.

ఉదా: $17 \times 17 = 289 \div 8$

శేషము 1 అగును.

**వివరణ:** ఒక ఇల్లు - సమచతురస్రముగా 17 అడుగుల పొడవు. అటులచే 17 అడుగులు వెడల్పు గలదు అనుకొందాము. దాని వైశాల్యము 17×17 = 289 అడుగులు వచ్చును. ఈ వైశాల్యాన్ని 8చే భాగించినచో శేషము

వైశాల్యమునకే పదము అనియు నామాంతరము గలదు.

1 వచ్చును. అనగా ధ్వజాయము వచ్చును, ఈ వైశాల్యమును బట్టియే ధనము, ఋణము-తిథి-వారము మొదలైనవియును సాధింపబడును ఈ విషయం ఉత్తర గ్రంథములో వివరింపబడును ప్రస్తుతము ఎత్తు విషయమున మాత్రము సంగ్రహపరిచయము చేయబడింది. నిర్మాణ విశేషాలను అనుసరించి ఎత్తు అనేది బహువిధాలుగా ఉంటుంది.

పశుశాలలకు ఏ విధంగాను - సింహాయము ఉండరాదు. ఈ విషయం నాల్గవ భాగంలో వివరంగా వ్రాయబడును.

**నివాస గృహాల ఎత్తు విషయము**

కడప లేక ముఖద్వారము క్రింది భాగము నుండి పండ్రెండు అడుగులకు మించి ఆయానుగుణంగా దూలం లేక ఇంటి పై కప్పు యొక్క క్రింది భాగానికి ఎత్తు ఉండుట అనేది అన్ని గృహాలకు ముఖ్యం అని తలంపవలయును. గృహవాసులు కొంత ఎత్తుగలవారు అయినచో ఇంకను రెండు అడుగులు ఎత్తు ఆయానుగుణంగా ఇంటి యొక్క వైశాల్యానికి తగిన విధంగా ఉండడంలో దోషంలేదు, ఇందుకు కారణాలను శాస్త్రకారులు ఈ విధంగా తెలుపుదురు.

గృహస్వామిగాని - అతని ఆప్తబంధువులు గాని తలవంచుకొని ప్రవేశింపని విధంగా ద్వారాలు ఉండవలయును. తలవంచుకొని ప్రవేశించే గృహస్వాములకు తలవంపులే అనగా అవమానములు, పరాభవాలు గల్గును అనియు పెద్దలు అందురు. తలవంచుట అనే పదానికి అవమానం అనియు ఒక అర్థం గలదు. తలవంపుకొంప అనగా అవమానాల ఇల్లు అని ద్వంద్వార్థం గలదు.

వంద సంవత్సరాల క్రిందట మానవుల సగటు ఎత్తు 8 అడుగుల వరకు ఉండేది. అట్టి స్థితిలో గృహద్వారమే కనీసము తొమ్మిది అడుగులకు తగ్గని విధంగా ఉండవలయును. సగటు ఎత్తు అనుటచే కొందరు విశేషవ్యక్తులు పది అడుగులకు మించియు ఎత్తుగా ఉండేవారు అని తెలియదగును, అట్టి స్థితిలో గృహద్వారాలు దాదాపు పదునొకండు అడగుల వరకు ఎత్తు ఉండవలయును అని తెలియుచున్నది.

ఇక ఎద్దులు, ఆవులు గల్గిన భూస్వాములు లేక వ్యవసాయదారులు వంటి వారి గృహద్వారాలు అయినచో పశువుల ఎత్తును అనుసరించి అనగా వాటికి తల తగలని విధంగా ఇంటిలో వాటిని కట్టే స్థలంలో మచ్చులు ఏర్పాటు చేస్తారు. ఈ మచ్చులపై వాటి ఆహారమైన గడ్డి, పొట్టు మొదలైనవి నిల్వ ఉంచడము నేటికిని కొన్ని గ్రామాలలో ఆచారంగా ఉంది. మచ్చుపై గడ్డి నిల్వ ఉంచడం సాధ్యంగాదు ఇలాంటి వ్యవసాయదారుల గృహాలు ఇంటి బేసి మట్టానికి దాదాపు ఇరువది అడుగుల వరకు సైతము ఎత్తు ఉండడం అవసరము. నేడు రాయలసీమ ప్రాంతాలలోను, తెలంగాణా ప్రాంతాలలోను వ్యవసాయదారుల భవనాలు, ఇటుల ఎత్తు గలవిగానే దర్శనం ఇచ్చుచున్నాయి. మరియు గోడలకు అటకలు ఉంతురు ఈ - అటకలపై సామానులు ఉంచడం పరిపాటి. ఆ అటకలు ఇంటిలోని వారి ఎత్తుకంటే కొంచెం ఎత్తులో గోడలకు ఉంతురు. తక్కువ ఎత్తులో ఉన్నచో ఇంటిలోని వారి తలలకు ప్రమాదవశమున గోడదగ్గర తిరుగునప్పుడు తగిలే అవకాశం గలదు. సామాన్యంగా ఈ అటకలు ఇండ్లలో ద్వార సమానమైన ఎత్తు నందు మాత్రమే ఉండును. ద్వారాల ఎత్తు, గృహవాసుల తలలకు తగులని విధంగా ఉండవలయును అన్నాము, గనుక ఇవియును తలలకు తగలని విధంగా ఉండగలవు. కొన్ని యెడల అటకలు గోడలకు దాదాపు మూడు అడుగుల ఎత్తులోను ఉండును. ఇవి సామాన్యంగా వంటగదిలో చెంబులు గ్లాసులు వంటసామానులు ఉంచుకొనడానికి ఉపయోగిస్తారు. ఇటువంటి అటకలు వంటయింటిలోని అలమారాలతో అనుసంధింపబడియు ఉంటాయి. ఏమైనను ఇవి తక్కువ ఎత్తులో ఉండును గనుక, ఇంటిలోని వారి తలలకు తగిలే ప్రమాదంలేదు.

నేడు ఆధునిక యుగంలో - సామాన్యంగా చాలా మందికి గదులలో సీలింగ్ ఫ్యానులు ఉండును. వాటి ఏరాటుకు ఇంటి పైకప్పు నుండి క్రిందికి కనీసం మూడు అడుగులైన వ్యత్యాసం అవసరం అగును. ఇంటిలోని వారు పొరపాటున చేతులు పైకి ఎత్తినచో - ఫ్యానుల రెక్కల వలన కీడు గల్గడానికి అవకాశం గలదు. అందుచే ఇంటిలోని వారు చేతులు పైకి ఎత్తినను తగలని అంత ఎత్తులో ఫ్యానులు ఉండడం శుభం అగును. ఇది అంతయు స్థూలంగా సమీక్షించినచో ఈ క్రింది విషయాలు బోధ పడుతున్నాయి.

సామాన్య నివాసగృహాలు - పదునైదు అడుగులకు తక్కువ ఎత్తుగా బేసిమట్టం నుండి లేక కడప క్రింది బండనుండి ఉండడం ఈ పదునైదు అడుగులును అంగుళములలో సరిసంఖ్య అంగుళములు. అనగా 180 అంగుళములు అగును గనుక ఆయమునకు సరిపడునట్లుగా పైగా - బేసి అంగుళాలను చేర్చి ఎత్తు ఉంచడం మంచిది అని తెలియదగును.

చలన చిత్రాలయాలు (సినిమా హాల్స్) యంత్రాలయాలు (ఫ్యాక్టరీలు) మున్నగునవియును తగిన విధమైన ఎత్తులో ఉండదగును. సినిమా హాళ్ళు అన్నియును ఒకవిధంగా ఉండవు. కొన్నింటికి బాల్కనీలు ఉంటాయి కొన్నింటికి ఉండవు. అటులచే ప్రేక్షకుల సంఖ్యావిషయంలోను భిన్నత అనేది ఉండును. దానికి తగినట్లు వెడల్పు, పొడవు ఏర్పడును. ఈ పొడవు వెడల్పులను బట్టి ఎత్తు ఏర్పడును. ఆరంభంనందలి ఎత్తు, వెనుకకు వచ్చు సరికి తగ్గిపోవును. అందుచే నిరపాయకరంగా ఎత్తును ఉంచదగును. ఇటువంటి స్థలాలలో ఏ ఎత్తునకు ఆయమును నిర్ణయింపవలయునన్నచో - నట్టనడుమ ఉండే ఎత్తును గ్రహించడం సముచితము.

ఫ్యాక్టరీల విషయంలోను పొందించే యంత్రాల పరిస్థితిని అనుసరించి ఎత్తును నిర్ణయింపవలసి యుండును. సందర్భమును బట్టి - యంత్రాల పొందిక విషయాలలోని కొన్ని విషయాలను తెలియచేస్తున్నాను. ఈ యంత్రాలను - ముఖ్యంగా బరువైన యంత్రాలను పొందించే సందర్భము నందు - ఈశాన్యమునందును - నడుమ భాగం నందును - యంత్రాలు లేని విధంగా శ్రద్ధ వహించడం అవసరము - విధిలేక యంత్రాలు ఉంచవలసి వచ్చినచో - తేలికైనవి అనగా ఎక్కువ బరువులేని వాటిని ఉంచడం శుభం అగును. ఏలననగా ఈశాన్యము స్థిరవాస్తు పురుషుని శిరోభాగము అగును. నడిమిభాగము - స్థిరవాస్తు పురుషుని యొక్క హృదయ భాగము అగును - ఈ రెండును వాస్తుపురుషుని మర్మావయవాలలో ముఖ్యములును, జీవి రూపములును అగును. అందుచే యంత్రాలు అధికంగా రిపేరికి పోవచ్చును.

అటులనే యంత్రాల చక్రాలను సాధ్యమైనంతవరకు తూర్పునకు గాని, ఉత్తరమునకు గాని, తిరుగునట్లు అమర్చడం శుభం. ఈ విషయంలో వాస్తు శాస్త్రజ్ఞులను సంప్రదించడం శుభం అని తెలియదగును.

## 3. గృహోన్నతి విషయంలో కుతత్త్వాలు

ఏ గ్రంథం అయిననూ, ఎంతటి పవిత్ర శాస్త్రగ్రంథం అయిననూ, నాటి సంఘానికి ప్రతిబింబం అనక తప్పదు. సార్వజనికములునూ, సార్వకాలికములునూ అయిన శాస్త్రగ్రంథాల యందును, ఆయా గ్రంథకర్తల కాలాన్ని అనుసరించి నాటి సాంఘిక విషయాలు ఏదో విధంగా చోటు చేసుకుంటూనే ఉంటాయి.

పరమ పవిత్రమును - దేహాతీత ఆత్మధర్మ బోధకమును ప్రస్థానత్రయంలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించినదియును అయిన ప్రసిద్ధ భగవద్గీతా శాస్త్రవిషయాన్నే పరిశీలించండి.

**స్త్రీషు దుష్టాసువార్ష్ణేయ జాయతే వర్ణసంకరః**

(భగవద్గీత - ప్రథమాధ్యాయము)

**సందర్భ సహిత భావము:** అర్జునుడు కృష్ణునితో ఇలా అంటున్నాడు - ఓ కృష్ణా! యుద్ధంలో మగవారు చనిపోయినచో జవరాండ్రైన వారి భార్యలు దుష్టలై వ్యభిచరిస్తారు. అందుచే సంకర సంతానం జనిస్తుంది. వర్ణ సంకరము నరక హేతువు. అందుకు పరోక్షంగా నేనును కారణమై పాపిని అగుదును. ఇది అర్జునుని ప్రశ్నలోనిదే అయిననూ నాటి సాంఘిక పరిస్థితులకు దర్పణమువలె విరాజిల్లుతుంది.

అర్జునుని ఆక్షేపం ప్రకారం ఆలోచించిననూ కేవలం స్త్రీలు దుష్టురాండ్రైనంత మాత్రాన వర్ణసంకరంగల్గదు. అందులకు పురుష సహకారం సైతం అవసరంగానే ఉంటుంది. అట్టి స్థితిలో స్త్రీలను మాత్రమే దూషించడం అనేది పురుషాహంకారం తప్ప అన్యము గాదు. లేక స్త్రీస్వతంత్రముగా గాక భర్త యొక్క అంగీకారంతో చేస్తే అది వర్ణసంకరముగాదు అనియు అర్జునుడి భావం గావచ్చును. ఇంద్రాదులవల్ల తాము అయిదుగురు జనించిననూ తండ్రి అంగీకారం వలన జరిగిన కార్యం అగుటచే తమకు సంకర దోషం లేదు అనియు అర్జునుడు తలంచియుండవచ్చును.

దీనిచే భారత కాలం నాడు స్త్రీలస్థితి ఎంత హేయంగా ఉండేదో తెలుస్తుంది. గోహిరణ్యాదికంవలె జూదంలో పందెంగా ద్రౌపదిని ఉంచడంవల్ల ఇది మరియు పరాకాష్ఠకు చేరింది.

ఇంతే కాదు పురుషులందును అగ్రజాతేతరులు ఎంతయోగ్యులుగా ఉన్నను, ఏదో నెపంతో నిర్వీర్యులుగా చేయబడినారు. ఇందుకు ఏకలవ్యుని అంగుష్ఠమును గురుదక్షిణగా ద్రోణుడు కోరడమే పరమోదాహరణము.

ఇక కులము మరుగుపడిన కారణంగా కుమారాస్త్ర విద్యాప్రదర్శన సందర్భమున కర్ణుడు పొందిన అవమానమును అందరెరుంగుదురు.

**ప్రస్తుతాంశము:** సార్వకాలికిమైన వాస్తు శాస్త్రమునందును మధ్యయుగకాల రచనలయందు ఈ కులతత్వం కొంత చోటుచేసుకొన్నది ఇండ్ల ఎత్తు విషయంలో కొందరి గ్రంథాలయందు కులతత్త్వం చేరింది. అది అంతగా ముఖ్యంగాకపోయినను విషయాన్ని గ్రహించడం అవసరం అనే భావంతో పాఠకులకు సంగ్రహంగా పరిచయంచేయుచున్నాను.

ఈ ఎత్తులను ఎన్మిది వాటాలకు విభజిస్తారు. వాటము అనగా భాగము అని అర్థము. వాటయతి = విభాజయతి ఇతివాటిః అని వాటశబ్ద నిర్వచనము.

ఈ ఎన్మిది వాటముల నామములు ఈ క్రింది విధంగా ఉండును.

| | |
|---|---|
| 1. పాంచాల వాటకము | 5. మాగధవాటము |
| 2. వైదేహివాటము | 6. శూరసేనవాటము |
| 3. కౌరవవాటము | 7. గాంధారవాటము |
| 4. కౌజన్యవాటము | 8. అవంతి వాటము |

వీటి లక్షణాలు ఇటుల గలవు.

**పాంచాల వాటము:**

ఇంటి వెడల్పును - నాల్గుభాగాలు చేయవలయును. నాల్గవ భాగమునకు ఎంతవచ్చునో - అంత ఇంటి వెడల్పునకు పైగా చేర్చవలెను ఇప్పుడు అయిదు భాగములు అగును. ఈ అయిదు భాగాలలో సగభాగము ఎత్తు ఉంచినచో పాంచాల భాగము అగును - ఈ సగభాగము బేసి అంగుళములు ఎత్తుగా లేక ఆయాదికం సరిపడనిచో, తగిన

విధంగా అంగుళములు చేర్చవచ్చును.

**ఉదాహరణము:** ఇంటి వెడల్పు 16 అడుగులు ఉన్నది. అందు నాల్గవ భాగము (16÷4=)4 అడుగులు వచ్చును. నాల్గవ భాగమును మొత్తములో చేర్చినచో 16+4=20 అడుగులు అగును. ఇరువదిలో సగము పది అడుగులు అగును. పది అడుగులకు 120 అంగుళములు అగును. ఇది ఆయమునకు సరిపడదు. అందుచే పైగా ఒక అంగుళము చేర్చవలయును, అప్పుడు 120+1=121 అంగుళములు అగును, 121 అంకెను 8చే భాగించినచో 1 శేషము వచ్చును. ఒకటి శేషము అయినచో ధ్వజాయము అగును.

**వైదేహి వాటము:** పాంచాల వాటముపై రెండు అంగుళములు చేర్చినచో వైదేహివాటము అగును.

3. **కౌరవ్య వాటము:** వైదేహి వాటముపై రెండు అంగుళములు చేర్చినచో కౌరవ్యవాటము అగును. దీనినే కౌరవవాటము అనియును అందురు.

4. **కౌజన్య వాటము:** కౌరవ్య వాటముపై రెండు అంగుళములు చేర్చినచో కౌజన్య వాటము అగును.

5. **మాగధ వాటము:** కౌజన్య వాటముపై రెండు అంగుళములు చేర్చినచో మాగధ వాటము అగును.

6. **శూరసేన వాటము:** మాగధ వాటముపై రెండు అంగుళములు చేర్చినచో శూరసేన వాటము అగును.

7. **గాంధార వాటము:** శూరసేన వాటముపై రెండు అంగుళములు చేర్చినచో గాంధార వాటము అగును.

8. **అవంతి వాటము:** గాంధార వాటముపై రెండు అంగుళములు చేర్చినచో అవంతి వాటము అగును.

**ఈ అష్టవాటములలో - దేవతామందిరములకు - అవంతి వాటమును, బ్రాహ్మణులకు - మాగధవాటమును, క్షత్రియులకు - శూరసేన వాటమును - వైశ్యులకు - కౌజన్య వాటమును శూద్రులకు - వైదేహి వాటమును** తగినవి అని నిర్ణయించారు. ఇక తక్కిన పాంచాల - కౌరవ - గాంధారములచే మూడు వాటకములు చాకలి, మంగలి - వేశ్యలు మొదలగువారికి తగినవిగా వారు భావించారు.

ఈ ఎత్తును ముఖద్వారం వద్దనే నాటి శాస్త్రజ్ఞులు భావించి యుందురు. ఇల్లంతయు ఇదే ఎత్తులో ఉండడం అనేది ప్రాచీన వాస్తు శాస్త్రాలకు సమ్మతంగా లేదు. మరియు శిథిల ప్రాచీన నిర్మాణాలు సైతం ఇటుల కనబడడంలేదు. వాస్తు పురుషమర్మవేధ లేని విధంగా గృహాన్ని బట్టి, ఒకటి రెండు అంకణాలు మధ్యలో మూడు లేక నాలుగు అడుగులు పైకి ఎత్తుగా కట్టి గాలి వెలుతురుకై ప్రక్కగా కిటికీలు భవనాలు నేటికిని గలవు. లేక నడుమ ఎలాంటి మూత వేయక చుట్టు నాలుగు వసారాలు వేసిన భవనాలును గలవు. ఇవి శాస్త్రసమ్మతాలు అనియు వెనుక తెలుపబడింది. నడుమ ఖాళీస్థలంలో పడిన నీరు, తూర్పు ఈశాన్యములు నుండే సొరంగాల ద్వారా వెలుపలికి పోయే ఏర్పాటు ఉండును. ఈ నడుమ ఉండేతగ్గుస్థలము - ఇంటి వెలుపల ఉండే భూమి మట్టమున కంటె కొంత ఎత్తులో ఉండును. అందుచే నీరు తేలికగా వెలుపలికి పోవును. ఏమైనను - కులాలను అనుసరించిన ఈ విభజన అనేది సభ్యసమాజానికి తలవంపు అగును.

**మహర్షయః సప్తపూర్వే చత్వారోమనవస్తథా।**
**మద్భావామానసా జాతా ఏషాంలోకే ఇమాః ప్రజాః॥**

**భావము:** నా వలన కశ్యపాది మహర్షులును స్వాయంభువాది మనువులును జనించారు, వారివలన - ఈ సమస్తప్రజల సృష్టియును గల్గినది. ఇట్టి మానవులందరును మనుసంతానమో - మహర్షి సంతానమో - అగుదురు మూలము పరబ్రహ్మభూత - మహర్షి - మలయాళస్వాముల వారు - ఏదేని పర్వదినాలలో పూజాదికార్యక్రమాల యందు

సంకల్పసమయాన - మాతో ఇట్లు అనెడివారు. గోత్రముతెలిసినవారు - గోత్రముతో చేయండి - గోత్రము తెలియని వారు - పరబ్రహ్మగోత్రోద్భవః అని చెప్పండి - అనే వారు.

ఇట్టిస్థితిలో కులాల ప్రకారం గృహనిర్మాణం కంటె వృత్తిని బట్టి గృహనిర్మాణం శుభం అని తెలియదగును.

**4. దారు లక్షణములు**

దారువు - అనగా కొయ్యలేక కఱ్ఱ అని అర్థము. 'క్ర క చ కుఠారాదినా దీర్యతే ఇతి దారు' అని దారు శబ్ద నిర్వచనము - అంపము, గొడ్డలి మొదలైన వాటిచే చీల్చబడునది గనుక దీనికి దారువు అని పేరు గల్గినది. 'దౄ - విదారణే' - అనే ధాతువునకు (ణు) ఉ - ప్రత్యయము వచ్చి ఆదివృద్ధి గల్గడం వలన 'దారు' శబ్దము ఏర్పడినది అని వైయాకరణులు అందురు.

ఇది ఎంతగా సిమెంటు ఉక్కు ఇత్యాదుల తోడియుగమైనను - ఎవరో కొందరు తప్ప సామాన్యంగా కొన్ని ముఖ్యమైన గృహోపకరణముల విషయంలో అధిక జనులు దారువులను ఉపయోగిస్తూ ఉందురు. అందుచే ఎటువంటి దారువులు ఇంటికి వాడుట మంచిదియో ఎటువంటివి ఉపయోగింపరాదో తెలిసికొనడం మిక్కిలి అవసరం అనే భావంతో వాటి విషయం ఇచ్చట సంగ్రహంగా వ్రాయుచున్నాను.

**5. సజీవ నిర్జీవ దారువులు**

వృక్షములు జీవించియుండగా - గొడ్డలితో ఛేదించి గాని, అంపముతో కోసిగాని - విఱచిగాని ఇతర విధంగా గాని వాటినుండి తీయబడిన కొయ్యలు సజీవ దారువులు అనబడును - వాయువు వలన గాని వరదతాకిడిచే గాని పడిన వృక్షాల కఱ్ఱలును సజీవదారువులే అగును వీటిలో యోగ్యమైనవాటిని గృహాలకు వాడవచ్చును.

**నిర్జీవ దారువుల లక్షణము**

1. వేరు పురుగుల వల్లగాని, చీడలవల్లగాని, ద్రావకాది మందుల కారణంగా గాని స్వయంగా గాని చనిపోయిన వృక్షాల కఱ్ఱలు నిర్జీవ దారువులు అనబడును.
2. అగ్ని ప్రమాదం కారణంగా చనిపోయిన వృక్షాల కఱ్ఱలు నిర్జీవ దారువులు అనబడును. ఈ కఱ్ఱలు జీవకళతొలగి ఉంటాయి. ముఖ్యంగా కఱ్ఱలలో తైలపదార్థం నశించడం వలన కాంతి లేనివి యై యుండును. కొంత అనుభవం గలవారు తేలికగా ఇలాంటి కఱ్ఱలను గుర్తింపగలరు. రోగంచే చనిపోయినవాడికి - హత్యచే మృతుడైన వాడికి ఉన్నంత తేడా రెండు కఱ్ఱల యందు స్పష్టంగా కనబడుతుంది. ఇలాంటి నిర్జీవదారువులను - గృహోపకరణములకు వాడరాదు అని తెలియదగును.

**6. సజీవ దారువులను అమర్చుటలో కొన్ని నియమములు**

కఱ్ఱలను చూచినచో అనుభవజ్ఞులైన వారలు. వాటి క్రింది భాగము అనగా మొదలు ప్రక్క భాగము ఏదియో అటులనే పై భాగము ఏదియో తేలికగా గుర్తింపగలరు. కఱ్ఱలు ఎంత నున్నగా తూపడచేయబడినను రంగు పూయనిచో పై భాగమును క్రింది భాగాన్ని వడ్రంగులు, రైతులు గమనింపగలరు - అందుచే అటుల గుర్తించిన మీదట - ద్వారబంధాలు అలాగే స్తంభాలు మొదలగు వాటికి వాడునప్పుడు. క్రింది భాగాలను క్రిందికిని పై భాగాలను పైకిని ఉండేటట్లు అమర్చవలయును.

దూలాలుగా ఉపయోగించేటప్పుడు శాస్త్రకారులు ఈ క్రింది నియమాలను బోధించారు. తూర్పు పడమరలుగా దూలములు ఉంచవలసి వచ్చినచో పడమట మొదళ్లను - తూర్పున పై భాగములను ఉంచవలయును - ఉత్తర దక్షిణములుగా దూలాలు ఉంచవలసినచో దక్షిణమున మొదళ్లను ఉత్తరమున కొనలను ఉంచవలయును.

## 7. చౌకముగా (చౌకట్టుగా) దూలములను అమర్చే పద్ధతి

దూలము మొదటి భాగము శక్తి స్వరూపము అనియు కొనభాగము శివస్వరూపము అనియు శాస్త్రకారులు తమ అనుభవంచే నిర్ణయించారు. అందుచే వరుసగా దూలాలను సంధించవలసినచో ఒకదాని మొదలుతో ఒక దానికొన కలియవలయును. అది సర్వశుభావహము అని పై నియమమును ఏర్పాటు చేసినారు. కొనలతో కొనలు - మొదళ్లతో మొదళ్లు కలవరాదు. అలా కలిసినచో అగ్ని భయం దీర్ఘవ్యాధులు గల్గును అనియు అనుభవపూర్వకంగా నిర్ణయించారు.

అయితే చౌకంగా కూర్చునపుడు ఈ నియమం సరిపడడం లేదు. అందుచే శాస్త్రకారులు ఇలా నియమం ఏర్పాటు చేసినారు.

**ఉదా:**

1. చౌకగా దూలాల అమర్చే విషయంలో నైరుతి కోణమును గ్రహింతము. దక్షిణ పశ్చిమముల కలయికయైన కోణమును - నైరుతి మూల అందురు. ఇచ్చట - తూర్పుగా ఆగ్నేయ కోణమునకు ఒక దూలం పోవును. ఉత్తరముగా వాయవ్యమునకు ఇంకొక దూలము పోవును. ఆగ్నేయముగా పోవు దూలానికి పడమట నైరుతిలో మొదలు ఉండవలయును - వాయవ్యనముగాపోవు దూలానికి దక్షిణ నైరుతిలో మొదలు ఉండవలయును. అందుచే ఈ నైరుతి కోణములో రెండు మొదళ్లే కలుస్తున్నవి. ఇచట మొదలు కొనతో కలయుడం దోషం కాదా? ఆక్షేపము.
2. ఈశాన్యమునందును వాయవ్యమునుండి వచ్చే దూలము మొనయును = ఆగ్నేయం నుండి వచ్చే దూలము మొనయును కలుస్తున్నవి. రెండు మొనలు కలియుట దోషం కాదా! అని ఆక్షేపము.

**సమాధానము:**

ఈ విషయం గుర్తించియే శాస్త్రకారులు నైరుతి కోణంలో రెండు మొదళ్లను - ఈశాన్యంలో రెండు కొనలును కలియవచ్చునన్నారు. మరియు మూలలందు ఒక దూలముపై ఇంకొక దూలాన్ని సంధించే విధానాన్ని సైతం ఇలా బోధించారు. సామాన్యంగా కొనలు చేర్చడం అనేది సామాన్య నియమమంగా తెల్పబడింది - ఇచ్చట నైరుతి యందు రెండు మొదళ్లు చేరినవి. ఇచ్చట ఎట్లు చేయవలయును అనే ప్రశ్న జనిస్తుంది. అటులనే ఈశాన్యాన రెండు కొనలు చేరినవి. దేనిపై దేనిని ఉంచి సంధించాలి అనే ప్రశ్న జనిస్తూఉంది.

**దీనికి శాస్త్రకారుల సమాధానము:**

ఆగ్నేయమునకు పోయే దక్షిణ దిక్కునందలి దూలంపై అనగా దాని మొదలుపై వాయువ్యానికి పోయే దూలము యొక్క మొదలు ఉంచి సంధింపవలయును. ఈ సంధించే సందర్భమునందు - పశ్చిమదిశా దూలము యొక్క మొదటి భాగము నందు క్రింది భాగంలో అవసరానుగుణంగా కొంతమేర తీసివేస్తారు. అలాగే దక్షిణ దూలం యొక్క మొదటి భాగంలో పై భాగాన్ని అవసరానుగుణంగా కొంత తీసివేస్తారు, తర్వాత హెచ్చుతగ్గులు లేనట్లు చేస్తారు, ఇది దూలాల వెడల్పును బట్టి జరుగుతుంది. ఇక ఆగ్నేయ వాయవ్యములందు మొదళ్లపై కొనలు చేరడానికి అవకాశం గలదు గనుక విప్రతిపత్తిలేదు.

కేవలం ఈశాన్య కోణంనందుమాత్రమే నైరుతిని రెండు మొదళ్లు చేరినట్లుగా రెండు కొనలు చేరుచున్నవి. ఇచ్చట వాయువ్యం నుండి వచ్చే ఉత్తర దూలంపై ఆగ్నేయం నుండి వచ్చే తూర్పు దూలాన్ని ఉంచదగును - అగ్ని

కంటె వాయువు బలమైనది. 'వాయోస్తేజః' అనే శ్రుతినిబట్టి - వాయువు నుండియే అగ్నికి ఉత్పత్తిగలదు వాయువు లేనిచో అగ్నిమనలేదు - ఆరిపోవును.

## 8. ఉపయోగింపరాని మరి కొన్ని దారువులు

భూతప్రేతాది నివాస వృక్ష దారువులు - శ్మశాన వృక్షముల దారువులు - దేవాలయవృక్షముల దారువులు - యోగ్యములుగా అనగా సజీవదారువులైనను గృహమునకు ఉపయోగింపరాదు.

జీర్ణ గృహమునకు నూతన దారువులను నూతన గృహానికి జీర్ణగృహ దారువులను ఉపయోగింపరాదు. జీర్ణ గృహమునకు నూతన దారువులను ఉపయోగింపవచ్చును.

ఒక గృహానికి ఒకే జాతి దారువులను ఉపయోగించడం సర్వోత్తమము. రెండు జాతుల కఱ్ఱలను ఉపయోగించడం మధ్యమము. మూడు జాతుల కఱ్ఱలను ఉపయోగించడం అధమ పక్షము అగును.

నాల్గు జాతుల కఱ్ఱలను ఎట్టి పరిస్థితులలోను ఉపయోగింపరాదు. అని శాస్త్రకారులు నొక్కి వక్కాణించారు, అని అందరును గమనింపదగును.

## 9. స్తంభదూల సంఖ్యాది నిర్ణయము

స్తంభములు - వాటికి సమానమైన పిల్లర్లు మొదలైనవి సరిసంఖ్యలో ఉండవలయును - అనగా 2-4-6-8-10 మొదలగు పద్ధతిలో ఉండవలయును.

శ్లో॥ అధ వక్ష్యామి సంభేదాత్ స్తంభానాం పంక్తినిర్ణయమ్।
అయుగ్మాః పఙ్క్త్యయస్తత్ర యుగ్మాస్తంభాదయః సస్మృతాః॥

**భావము:** స్తంభపంక్తులు అనగా స్తంభమధ్య భాగములు బేసి సంఖ్యలోను స్తంభములు మొదలైనవి సరి సంఖ్యలోను ఉండవలయును.

**విశేషము:** పై శ్లోకమునందు స్తంభాదయః అని ఆదిపదమును పేర్కొనడం వలన - దూలములు వాసములు - ఖడ్డీలు - కిటికీలు మొదలైనవి సరిసంఖ్యలో ఉండవలయును అని గ్రహింపవలయును.

దేవాలయ నిర్మాణములందు యుగ్మాయుగ్మ సంఖ్యలో నెట్లయిననూ స్తంభాదులను ఉంచవచ్చును అని కొందరు శాస్త్రకారులు అందురు.

సరిసంఖ్య విషయములో కొందరు 10-20-30 వంటి సున్నతోడి సరిసంఖ్యలు పనికిరావు అందురు - ఇందుకు సరియైన ప్రమాణములు కనబడడంలేదు - దశస్తంభములతోడి గృహాలలో నివసించేవారు శుభంగా ఉండడం సైతం గలదు.

పది స్తంభాలతో గృహభేదాలు దాదాపు ఎన్మిది విధాలు ప్రాచీన వాస్తు గ్రంథాలలో ఉదాహరింపబడినాయి.

ఉదా 1:




ఉదా 2: అర్ధవృత్తాకారము




ఉదా: వృత్తాకార దశస్తంభ నిర్మాణము



ఇటువంటి ఉదాహరణలను బట్టి సున్నతోడి సరి అంకెల తోడి స్తంభాలు దూలాలు సముచితములే అని తెలియుచున్నది.

స్తంభాలు దూలాలు వరుసతప్పని విధంగా ఉండవలయును మరియు వాస్తు పురుష మర్మస్థానాలను తప్పి ఉండవలయును.

ఇక స్తంభాలు సైతము వృత్తాకారాలు అష్టకోణాకారాలు, ద్వాదశకోణాకారాలు, షోడశకోణాకారాలు ఇత్యాదిగా ఎన్నియో భేదాలతో ఉండును.

కోణ మధ్య భాగాల యందు లతా-పుష్పాది చిత్రాలు, గంధర్వ కన్యకా శృంగార భంగిమలు శ్రీమంతుల సంపదకు ప్రతిబింబములై కొన్ని యెడల సాక్షాత్కరిస్తూ ఉంటాయి. ఇలాగే స్తంభాలకు, దూలాలకు మధ్యన ఉండే పొందిక చెక్కల యందును ఈ శిల్పనైపుణ్యం ఉండును.

లక్ష్మీపార్వతీ - సరస్వతీ బ్రహ్మవిష్ణు శివాది దేవతా శిల్పాలను మాత్రము మానవ నివాసగృహములందు చెక్కింపరు దేవాలయములందు మాత్రం - ఆయా దేవతా ప్రాశస్త్యమును ప్రబోధించే గాథా చిత్రాలను సైతం చెక్కించడం ఆచారంగా ఉంది. శ్రీశైల ప్రాకారశిలలయందు శివపురాణగాధా చిత్రాలు అన్నియు క్రమపద్ధతిలో గలవు. అటులనే పురాణప్రసిద్ధ క్షేత్రాలన్నింటిలోను చాలా వరకు గలవు. ఈ విషయాన్ని పాఠకులు అనుభవపూర్వకంగా గుర్తింతురుగాక.

## 10. ద్వారలక్షణములు

ద్వార-కవాట- కపాట - ద్వార్ అనే శబ్దాలు - పర్యాయపదాలు అగును అనగా ఈ పదాలు అన్నియును ఒకే వస్తువును బోధించేవి అని భావము.

ఇందు - ద్వార్ శబ్దము ద్వార శబ్దము అవయవార్థ విషయంగా పరిశీలించినచో సమానంగానే ఉంటాయి. ద్వే-అరేయస్వతత్ ద్వారం - అనగా రెండు అరలు గలది ద్వారము అగును మొదట ద్వారానికి వాకిళ్లు రెండుగా ఉండేవి అని దీనిచే తెలియుచున్నది. క్రమంగా గృహప్రవేశోపయుక్త మార్గమునకు ద్వార శబ్దము వాచకమైనది. అనగా అది వాకిలి ఒక్కటి గలదైనను ద్వారమే అగును.

పూర్వము నాలుగు ప్రక్కలను చెక్కలు గల్గిన కడప ఉండడము దానికి ద్వారాలు ఉండడము, అనేది ఆచారంలో ఉండేది. అందుచేతనే ప్రాచీనుల కడపమాను చెక్కల విషయమునందు నియమము ఏర్పాటుచేసినారు.

తే ॥గీ॥"దారువులు రెంట ద్వార బంధమ్ముదగదు" ॥
మంచమునకు మూడు జాతుల మర్పరాదు ।
తలుపు సరిపల్కులైయున్న దగదటండ్రు
తొడరి దూలముననడుమను - నడువరాదు ॥

(కృష్ణవాస్తువు)

**భావము:** ద్వార బంధము యొక్క నాల్గు పట్టెలును ఒకే జాతికి చెందిన కఱ్ఱలై యుండవలయును - రెండు మూడు నాల్గు జాతులకు చెందినవిగా ఉండరాదు. మంచము ఒక జాతికఱ్ఱకు చెంది ఉండవచ్చును - లేక పట్టెలు నాల్గు ఒకజాతివిగాను - కోళ్ళు నాల్గు ఒకజాతిని గాను ఉండవలయును. అంతేగాని రెండు కోళ్లు, రెండు పట్టెలు ఒక జాతివిగాను, తక్కిన రెండు కోళ్లు రెండు పట్టెలు ఇంకొక జాతివి గాను - ఉండరాదు.

ఇక తలుపు అనగా వాకిలి ఒకే జాతి కఱ్ఱకు చెందినది అయిననూ, మూడు చెక్కల కలయికదై ఉండదగును. అంతేగాని రెండు నాలుగు ఇలా సరి చెక్కల తోడి కలయిక గలదిగా ఉండరాదు. ముఖద్వారం నుండి ఇంటిలోనికి ప్రవేశింపగానే దూలముక్రింద నడుచునట్లును ఉండరాదు.

కాని నేడు కొన్ని యెడల ద్వారమునకు వాకిలి ఒక్కటియే ఉండడం సైతము గలదు. మరియు కొన్ని షాపులకు ఇనుప షట్టర్లు అమర్చుచున్నారు, ఇవి పై నుండి కిందికి వచ్చును, భద్రత కొరకై ఈ ఏర్పాట్లు వచ్చినవి. కనుక ద్వారాల విషయంలో కాలానుగుణంగా ఎన్నియో మార్పులు వచ్చినవి. అందుచే రెండు అరలు అనగా వాకిళ్లు రెండు లేకపోయినను గృహప్రవేశమార్గము ద్వారముగా నేడు ప్రసిద్ధినిగన్నది.

**ద్వార స్థాపన స్థలములు:**

గృహమునకు ద్వారములు ఉంచే విధానము ఆయా దిక్కులందు ఉండే గృహము యొక్క కొలతను బట్టియుండును - ఈ విషయము ఈ గ్రంథము యొక్క ద్వితీయ భాగమునందు 14-15-16 శీర్షికలందు వివరంగా తెలుపబడింది. ప్రస్తుతము అందు తెలుపని విషయాలు కొన్ని వ్రాయబడుచున్నవి.

1. ద్వారము గోడకు నడి భాగమునందు ఉండరాదు అనగా మనుష్యుని నివాసగృహానికి, మనుష్య సంబంధమైన పశుశాలాదులకును, గోడనడుమ ద్వారబంధమును ఉంచరాదు. సగభాగమును దాటిన తర్వాత ఉండవలయును అనగా గోడభాగము ఇంటిలోనికి ఎక్కువగా, వదలి ఆ మీదట ద్వార బంధమును ఉంచదగును, వెలి భాగము తక్కువగాను లోపలి భాగము ఎక్కువగాను ఉండునట్లు గోడకు ద్వారబంధము అమర్చవలయునని సారాంశము.

2. దిగ్దోషము లేని విధంగా ద్వారాన్ని అమర్చదగును. అనగా తూర్పు ద్వారమైనచో సరిగా తూర్పును చూడవలయును. దక్షిణ ద్వారమైనచో - పూర్తిగా దక్షిణాన్ని చూడవలయును - పశ్చిమ ద్వారమైన యెడల పూర్తిగా పశ్చిమమును చూడవలయును. ఉత్తర ద్వారమైనచో పూర్తిగా ఉత్తరమును చూడవలయును అంతేగాని ఏ మాత్రమును వంపును పొంది ఏదేని కోణమును అనగా మూలను చూచునట్లుగా ద్వార బంధము ఉంచరాదు.

   కొందరు తూర్పు ద్వారమును ఉంచేటప్పుడు దక్షిణమున ఉండే ద్వారము పట్టెను కనీసము అర్ధఅంగుళమైనను ముందుకు జరిపి ద్వారము ఈశాన్యమును చూచునట్లు ఉంచడం శుభం అందురు. కాని అందుకు తగిన ప్రామాణ్యం లేదు. దిఙ్మూఢం ఉండరాదు అనునదియే శాస్త్రకర్తల భావం.

   దేవాలయమునకు అమర్చేద్వారబంధం మాత్రం నడిగోడయందే ఉండవలయును - ముందు వెనుకలుగా ఉండరాదు - తక్కిన నియమాలు రెండింటికిని సమానము.

3. ద్వారబంధము నిలువుగా సరిగా ఉండవలయును - అనగా ఇంటిలోనికిగాని వెలుపలికిగాని వంగినట్లు ఏ మాత్రమును ఉండరాదు - వెలికి వంగినచో ఇతరుల వలనను, లోపలికి వంగినచో ఇంటిలోని వారివలనను అశాంతులు దుఃఖాలు గల్గును అని శాస్త్రకారులు అనుభవవాక్కు! ఇటులనే ద్వారము క్రింది భాగము సైతము - హెచ్చుతగ్గులులేని విధంగా ఉండవలయును - కుడిప్రక్క ఎత్తు అయినచో ఎడమ ప్రక్క గృహాలవారి వలనను - ఎడమ ప్రక్క ఎత్తు అయినచో కుడిపక్క గృహాలవారి వలనను అశాంతి గల్గును అని శాస్త్రకారులు అందురు.

**ద్వారములకు వాకిళ్లు అమర్చే విధానము**

ద్వారములకు వాకిళ్లు అమర్చే విధానము ద్వారానికి రెండు వాకిళ్లు ఉండదగును అని వెనుక ఈ ప్రకరణంలో

ద్వార శబ్ద నిర్వచనమును అనుసరించియే ద్వారానికి రెండు వాకిళ్లు ఉండదగును అని వెనుక ఈ ప్రకరణంలో తెలిపినాను.

నేడు ఒక వాకిలి ఉండడం సైతం కొన్ని యెడలగలదు - భద్రతకై పైనుండి క్రిందికి వేసే ఇనుప షట్టర్లు వచ్చినాయి. నేడు ఒక వాకిలి ఉండడం సైతం కొన్ని యెడలగలదు - కేవలము గృహప్రవేశ మార్గము ద్వారముగా నేడు అయినది అని అందుచే ద్వార శబ్ద నిర్వచనము తొలగిపోయి కేవలము గృహప్రవేశ మార్గము ద్వారముగా నేడు అయినది అని వెనుక సూచించినాను.

ఇక సాధారణంగా నివాస గృహాల విషయంలో వాకిండ్ల విషయమై శాస్త్రకర్తల యొక్క కొన్ని భావాలను సంగ్రహంగా పరిచయం చేయుచున్నాను. వాకిళ్లు పూర్తి బిగువుగా ఉండి మూయునప్పుడు గాని అలాగే తెరచినప్పుడుగాని శబ్దం గల్గించేవిగా ఉండరాదు. అట్లు శబ్దం గల్గించే వాకిళ్లు ఉండే గృహాలకు కలహాభయం ఉండును అని శాస్త్రజ్ఞులు అందురు.

ద్వార బంధానికి వాకిళ్ల సంధానము అనగా కూర్పు అనేది సమాన పద్ధతిలో ఉండవలయును, అటుల లేనిచో మనము తెరిచినను అవి అనగా వాకిళ్ళు స్వయంగా మూతపడుతూ వుంటాయి. కొన్ని ఇండ్లలో అటుల మూతపడకుండేందుకై రాతిని, వాకిలికి క్రింది భాగాన ఉంచడం చాలా చోట్ల చూస్తూ ఉంటాము. కొన్ని యెడల చిలుకును సడలింపగానే స్వయంగా

తెరువబడుతూ సైతం వాకిళ్లు ఉండడం కలదు.

ఈ రెండు విధాలుగానూ వాకిళ్లు ఉండరాదు. ఇక ఎట్లుండవలయుననగా తెరచినచో తెరువబడి ఉండాలి. అలాగే మూసినచో మూయబడి ఉండాలి అంతే గాని, మూసికొనడంలో తెరుచుకొనడంలో స్వతంత్రములై ఉండరాదు.

ఇలా వాకిళ్లు గృహస్వామి ఆజ్ఞకు బద్ధములై ఉండిన గృహంలో క్రమశిక్షణ చక్కగా ఉండును అని శాస్త్రజ్ఞులు అందురు అని సారాంశము. కొన్ని యెడల ముఖ్యంగా ప్రభుత్వకార్యాలయాలలో ముఖద్వారానికి ముందుభాగంలో సగానికి తక్కువగా ఒక స్ప్రింగ్ తలుపును అమరుస్తారు. అది తెరచినను వెంటనే స్వయంగా మూసుకొంటుంది. దాని విషయంలో ఏమి సమాధానం? అని కొందరికి సందేహం గల్గవచ్చును.

**సమాధానము:** యజమానుడే దానిని అటుల నిర్మించాడు. అది యజమానుని ఆజ్ఞను పాలిస్తూనే ఉంది. అందుచే అచ్చట ఆజ్ఞోల్లంఘనము అనేది లేదు గనుక దోషము లేదు అని తెలియదగును.

**ద్వారముల ఎత్తు విషయము**

ద్వారమునకు కపాట - కవాట శబ్దములు పర్యాయ పదములని వెనుక తెలిపియుంటిని. కం, శిరః పాటయతి చీరయతి ఇతి కపాటః = శిరమును, చీటునట్లు లేక పగులునట్లు చేయునది గనుక ఇది కపాటము అయినది. అటులనే, కంవిరః వాటయతి వ్యధయతీతి కవాటః= శిరమును బాధించునది గనుక కవాటము అయినది.

ఈ నిర్వచనాలను అనుసరించి మొదట గృహాలకు ద్వారాలు ఎత్తులేనివిగా ఉండేవి అనియు గృహంలో ప్రవేశించేవారు నమ్రశిరస్కులై అనగా శిరములు వంచుకొన్నవారలై - శిరములను వంచుకొని లోనికి అడుగిడేవారు అనియు - అటుల చేయకపొరపాటును - తల ఎత్తినచో తలలుగాయపడేవి అనియు తెలియుచున్నది. భూస్వాములు

- రైతులు - మొదలగు వారి గృహాలకు - ఇలా తలవంపు ద్వారాలు ఏ మాత్రం పనికిరావు. అయిదారు అడుగుల ఎత్తు ఉండే ఎద్దులు సైతం కొందరు రైతులకు ఉండును. వాటికి మూపురం. కొమ్ములు సైతం ఉండును. మనుష్యులు వంగినడిచేయిండ్లలో వాటిని ప్రవేశింపజేయడం సాధ్యంగాదు.

అందుచే ద్వారములు గృహవాసుల అవసరాలను అనుసరించి తగిన ఎత్తులోను వెడల్పులోను ఉండడం సముచితము.

ఇక అశ్వశాలలు - గజశాలలు వంటివి అయినచో - వాటిపైన పయనించేవాడు ఉన్నను, తలతగులని విధంగా ఉండడం మంచిది, గుఱ్ఱము మీద పయనించేవానిని గుఱ్ఱపు రౌతు అని అందురు. ఏనుగు పై పయనిస్తూ దానిని అదుపులో ఉంచుకొనేవానిని మావటీడు అందురు. గుఱ్ఱాన్ని నడుపింపగలడు, గాని - మావటీడు మాత్రం చాలవరకు ఏనుగును ఆరోహించియే దాన్ని నడుపిస్తాడు. పైన ఉండినచే అంకుశం ద్వారా దానిని అదుపులోనికి తేగలడు. ఇలాంటి గజశాలల ద్వారాలు అందుకు తగినట్లుగా ఎత్తుగా ఉండక తప్పదు అచ్చట వంగి పయనించడం మావటీకి గాని, ఏనుగునకుగాని సాధ్యపడదు. కవాట - కపాట శబ్దాలకు అనుగుణంగా వంగి నడవడం అనేది నేడు కొన్ని దేవాలయాలకు మాత్రమే పరిమితమై ఉంది. అదియును గర్భగుడి చిన్నదిగా ఉండే దేవాలయములందు మాత్రమే గలదు. తిరుమలలోని శ్రీ వేంకటేశ్వరాలయము, శ్రీకాళహస్తీశ్వరాలయము మొదలైన కొన్ని ఆలయములందు తలలు ఎత్తుకొనియే ద్వారాలలో ప్రవేశించడం గలదు. అనగా ద్వారం ఎత్తుగా గలవు అని భావము.

వీటినన్నిటిని గుర్తించియే కృష్ణవాస్తు శాస్త్రకారుడు - కొంచెమైయున్న బొడవైన గూడదండ్రు అని ద్వార లక్షణమును సంగ్రహముగా మొదట నిర్వచించెను - అనగా వాకిలి అనేది ఇంటిని అనుసరించి ఉండవలయునే గాని పొట్టిగా ఉండరాదు, అటులనే అధికమైన ఎత్తుగా సైతం ఉండరాదు అని కృష్ణవాస్తు కారుని భావము.

ద్వారము యొక్క ఎత్తునకు వెడల్పునకు ఉండవలసిన సంబంధమును సైతము ఇట్లు కృష్ణ వాస్తువులో గలదు.

1. ఎత్తును ఏడుభాగాలు చేసి అందునాల్గు భాగాలకు ఎంతకొలత వచ్చునో అట్టి కొలతతో వెడల్పు ఉండవలయును. అనగా - ఏడు అడుగులు ఎత్తు ఉన్నచో సుమారు నాల్గు అడుగులు వెడల్పు ఉండవలయును ఎత్తును తొమ్మిది భాగాలుచేసి - అందలి అయిదు భాగాలకు ఎంతకొలత వచ్చునో అంతకొలత గలదిగా వెడల్పు ఉండవలయును.

**ఉదా:** గుమ్మము తొమ్మిది అడుగుల ఎత్తు ఉన్నచో దాదాపుగా వెడల్పు అయిదు అడుగులు ఉండవలయును దాదాపుగా - అనుటచే ఒకటి లేక రెండు అంగుళములు ఎక్కువగా ఉన్నను. తక్కువగా ఉన్నను దోషములేదు అని తెలియదగును.

**సారాంశము:** గృహవాసుల అవసరాలకు తగినట్లుగా నిరపాయకరముగా ద్వారాలు ఉండవలయును అని భావము. అవసరాలకు - అనుటచే - తలపైన గాని, భుజంమీద గాని, నీళ్ల బిందెనో, కడవనో - లేక ఇతర వస్తువునో ఉంచుకొని గృహంలో శ్రమలేని విధంగా ప్రవేశించుటకు అనువైన విధంగా ద్వారాలు ఉండవలయును అని తెలియదగును.

## 11. ద్వార విషయంలో కొన్ని వేధాదోషాలు

వేధ అనగా వ్యధ - బాధ, దుఃఖము అని అర్థము.

**1. కూపవేధా దోషము:** వాకిలికి ఎదురుగా ఇంటికి లోతట్టున గాని - వెలుపలగాని బావి ఉండరాదు - అటుల ఉన్నచో కూపవేధాదోషము వచ్చును.

**ఫలము:** కూపవేధను పొందిన గృహము - గృహస్వామికిని అందులో నివసించేవారలకును అపస్మారవ్యాధిని అనగా

మూర్ఛరోగాన్ని గల్గిస్తుంది.

అందున్నవారికి అనుటచే అద్దెకు వసించేవారికిని ఈ దోషము గల్గును అని తెలియదగును.

**2. శైవ వేధా దోషము:** సింహద్వారమునకు అనగా ముఖద్వారమునకు ఎదురుగా శివాలయము గాని శివలింగము గాని ఉండరాదు.

**ఫలము:** శైవవేధాదోషాన్ని పొందిన గృహము గృహవాసులకు వృద్ధిని గల్గింపదు.

**గమనిక:** 1. గర్భగుడిలోని శివలింగం నుండి - దేవాలయ ప్రాకారం వరకు ఎంతదూరం ఉండునో - అంత దూరాన్ని ప్రాకారం నుండి వదిలి గృహం కట్టుకొన్నచో ఈ శైవ వేధాదోషం గల్గదు అని తెలియదగును.

2. ప్రక్కలను గృహాలు ఉన్నచో ఈ దోషం లేదు అనియు కొందరు శాస్త్రకారులు అందురు.

**3. దేవతావేధా దోషము:** గృహము యొక్క ముఖద్వారానికి ఎదురుగా శక్త్యాలయముగాని - వైష్ణవాలయముగాని - రామమందిరము గాని, భజన మందిరముగాని, ఆంజనేయాలయము గాని, గణేశాలయముగాని ఇంకా ఇతరములైన ఏ దేవాలయముగాని ఉండరాదు - అటుల ఉన్నచో దేవతావేధా దోషము గల్గును.

**ఫలము:** దేవతా వేధను బొందిన సర్వవిధములైన అనర్థాలకు లక్ష్యములు అగుచుండును.

**గమనిక:** పూర్వోక్తవిధంగా - దేవతా విగ్రహంనుండి ప్రాకారం వరకు ఉండే స్థలం యొక్క పరిమితికి తగిన దూరంలో ఉన్నచో ఈ దోషాలు గల్గవు.

శైవ వేధను ప్రత్యేకంగా పేర్కొనుటచే అది ఇతర దేవతా వేధల కంటే అధికమైన అనర్థాన్ని గల్గిస్తుంది అని తెలియదగును.

వైష్ణవాలయాల విషయంలో కొంత ఎదురుగా గృహాలు ఉన్నా ముఖద్వారాలు. ప్రక్కకు ఉన్నచో ఈ దోషాలు ఉండవు అందురు.

శివాలయాలు - శక్త్యాలయాలు - వీరాంజనేయ దేవాలయము - నరసింహాలయము ఇత్యాది భీకరాలయములకు ఎదురుగా గృహాలే ఉండరాదు అనియు కొందరు శాస్త్రకారులు అందురు. నరసింహాలయములో లక్ష్మీదేవియు ఉన్నచో ఈ దోషం ఉండదు అని కొందరు అందురు.

**సమీక్ష:** దేవతా వేధను ఇటుల దెల్పడంలో మన పెద్దలు ఎంతో నైతికతను పవిత్రతను పాటించినట్లు తెలుస్తూ ఉంది.

ముఖద్వారం - దేవాలయమునకు ఎదురుగా ఉన్నచో - మంచాలు వేసికొని కూర్చుంటారు - కొన్ని యెడల - అసభ్య పదాలతో దూషించుకుంటారు. అసభ్యకార్యాలు చేస్తారు, కలహిస్తారు గూడా ఇంకను నీతి మాలినవారు

దేవతా స్థలాన్ని సైతం కొంత ఆక్రమిస్తారు. ఇటుల ఎన్నియో దోషాలు చేయడానికి అవకాశం గల్గుతుంది. దీనిచే ఆలయ పవిత్రతకు భంగం గల్గుతుంది.

ఇటుల ఎన్నియో దోషాలను గుర్తించి దేవాలయ సమీపములందును ముఖ్యంగా దేవునికి ఎదురుగా తమయిండ్లకు ముఖద్వారాలను ఉంచుకొనరాదు అని శాస్త్రకారులు నిర్దేశించి ఉందురని తెలియుచున్నది.

**4. బ్రాహ్మణవేధా దోషము:** ముఖద్వారానికి ఎదురుగా బ్రాహ్మణ గృహం ఉండరాదు. అటుల ఉన్నచో బ్రాహ్మణవేధా దోషము గల్గును.

**ఫలము:** బ్రాహ్మణవేధా దోషమునొందిన గృహము గృహవాసులకు సర్వ అశుభాలను గల్గిస్తుంది, కొన్ని యెడల వంశ నాశనం సైతం జనిస్తుంది.

**వివరణ:** బ్రహ్మవేదం, అధవా శుద్ధం పరచైతన్యం వేత్తి అధీతేవా ఇతి బ్రాహ్మణః అని బ్రాహ్మణ శబ్ద నిర్వచనము. (పద్మచంద్రకోశః లాహోరు ముద్రణ)

**భావము:** బ్రహ్మము అనగా వేదము లేక శుద్ధమైన పరచైతన్యము (పరంబ్రహ్మము) అగును - దానిని అధ్యయనం చేసేవాడు. లేక తెలిసికొన్నవాడు బ్రాహ్మణుడు అగును. బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి (= బ్రహ్మజ్ఞాని బ్రహ్మయే అగును) అనే శ్రుతిని బట్టి బ్రహ్మజ్ఞానము గలవాడు బ్రహ్మమేఅగును - దేవాలయాలలో ఉండే విగ్రహాలు అన్నియు సగుణబ్రహ్మకు ప్రతీకములైన అర్చావిగ్రహాలు మాత్రమే అగును. ఇక బ్రహ్మజ్ఞులైన మహాత్ములు అందరును సగుణబ్రహ్మలే అగుదురు. ఇట్టి వారి నివాసముల దగ్గర గృహాలు కట్టుకొన్నచో మిక్కిలి భక్తి శ్రద్ధలతో మెలగవలసియుండును, లేనిచో వారి ఆగ్రహానికి లక్ష్యమై సర్వనాశనం పొందవలసి వచ్చును. అనే భావంతో ఈ నియమం ఏర్పడియుండును, అంతేగాని జాతిమాత్రం బ్రాహ్మణులను గురించి గాదు అని తెలియదగును.

అందుచే అభివృద్ధిని కోరే సంసారులు, జ్ఞానుల విషయంలో, భక్తి శ్రద్ధలతో వర్తించి వారి ఆశీస్సులను పొందడం శుభము. ఈ మహాత్ములు దూరంగా ఉన్నను లేక దగ్గరగా ఉన్నను, దర్శించి పాదధూళిని శిరమున ధరించడం జన్మసార్ధకత అనియు భావింపవలయును.

**5. స్తంభవేధా దోషము:** గృహము యొక్క సింహద్వారమునకు ఎదురుగాగానీ ప్రక్కనగాని స్తంభములు ఉండరాదు. అటులనే ఇతరములైన అవసరాలకు అనగా పందిరి మొదలైన వాటికొఱకు పాతిన స్తంభముగాని ఉండరాదు. విద్యుత్ (ఎలెక్ట్రిక్) స్తంభము సైతం ఉండరాదు. అట్లు ఉన్నచో స్తంభవేధాదోషము గల్గును.

**ఫలము:** ఈ దోషం భార్యా నష్టమును గల్గిస్తుంది మరియు గృహవాసులను దుర్గుణాసక్తులను గావిస్తుంది

**పరిహారము:** మధ్యన వీధి ఉన్నచో ఈ దోషం గల్గదు అనగా రోడ్డుకు అవతలి ప్రక్కన స్తంభాదికం ఉన్నచో స్తంభవేధా దోషం లేదుఅని తెలియదగును.

**6. పంకవేధా దోషము:**

పంకము = బురద

ఇంటి యొక్క ముఖద్వారానికి ఎదురుగా బురద ఉన్న యెడల పంకవేధ అనేది గల్గును.

**ఫలము:** పంకవేధాగృహము గృహవాసులకు దుఃఖమును విచారాన్ని గల్గిస్తుంది.

**వివరణ:** నీరు నిలువనట్లు చేసినచో ఈ దోషము తొలగును. వర్షము వచ్చినప్పుడు గాని - నీరు చల్లుటచేగాని ఏర్పడిన తాత్కాలికమైన బురద విషయంలో ఈ దోషం వర్తింపదు.

**7. ప్రవాహ వేధా దోషము:** ముఖద్వారానికి ముందుగా ఏదేని వాగు - కాలువ - మొదలైనవి ప్రవహించునట్లు ఉండరాదు. అట్లు ఉన్నచో ప్రవాహవేధా దోషము గల్గును.

**ఫలము:** ప్రవాహ వేధా దోషము గల్గిన సంతాన నష్టము - వస్తునష్టము ఇత్యాదిరూపంగా దుఃఖాన్ని గల్గిస్తుంది.

**వివరణ:** పసిబిడ్డలు - పొరపాటున ప్రవాహం వద్దకు పోవడం, అపాయాలు పొందడం అటులనే వస్తువులు ప్రవాహంలో కొట్టుకొని పోవడం ఇత్యాది దోషాలు గల్గును అని ఫలితార్థంగా తెలియదగును.

**పరిహారము:** పెద్ద ప్రవాహము అయినచో రెండువందల గజాల దూరమును - చిన్న ప్రవాహమైనచో దానికి తగినట్లుగా కొంత దూరముననుు ఉన్నచో ఈ దోషము లేదు అందురు.

శాశ్వత ప్రవాహాల విషయమునందే ఈ దోషము వర్తిస్తుంది గాని - వర్షము ద్వారా ఏర్పడే తాత్కాలిక ప్రవాహాల విషయంలో ఈ దోషం లేదు అని కొందరు శాస్త్రకారులు అందురు.

**8. వృక్షవేధా దోషము:** ముఖద్వారానికి ఎదురుగా శాస్త్రసమ్మతమైన వృక్షాలు సైతము ఉండరాదు. అటుల ఉన్నచో వృక్షవేధా దోషము గల్గును.

**ఫలము:** వృక్షవేధా దోషమునందిన గృహము - గృహవాసులను, అవినీతి వర్తనులను చేయును, స్త్రీలను సైతము శీలహీనులను గావించును.

**వివరణ:** శాస్త్రకారులు - ఇటుల ఫలమును దెల్పుటకు కారణము తెలియదు.

**గమనిక:** తొలగించుటకు అనగా నతికివేయుటకు వీలుగా - టెంకాయ చెట్టు వంటి పూజా వృక్షము ఉన్నచో దానిముందు ఇంటి ముఖద్వారం దిశను తులసి చెట్టును - ఉంచినచో ఈ దోషం తొలగును అని శాస్త్రకారులు అందురు. పూజా వృక్షాలు తొఱ్ఱలు పడి - ఇంటిమీద పడునట్లు ఉండినచో కొట్టవచ్చును గాని అకారణంగా కొట్టరాదు అనియు శాస్త్రజ్ఞులు అన్నారు. తొఱ్ఱల కారణంగా పాములు మొదలైన విషజంతువులకు నివాసాలైనను కొట్టవచ్చును అని వాస్తు శాస్త్రజ్ఞులు అన్నారు.

**9. వీధివేధా దోషము:** ఈ వేధా దోషాన్నే వీధిశూల అనియు రథ్యావేధ అని శాస్త్రకారులు అందురు. ముఖద్వారానికి ఎదురుగా వీధి ఉన్నచో వీధి వేధా దోషము అందురు.

**వివరణ:** అడ్డముగా పోయే వీధి, ఎదురుగా ఉండే వీధికంటె చిన్నదిగా అనగా తక్కువ వెడల్పుగా ఉన్నప్పుడు మాత్రమే, ఈ వీధి శూల దోషం గల్గును. ఎదురుగా ఉండే వీధి కంటె అడ్డముగా ఉండేవీధి ఎక్కువ వెడల్పు గలదైనచో ఈ దోషం గల్గదు.

స్ఫుటంగా అర్థం అయ్యేందుకు గాను - పటమును చూడుడు.




**వివరణ:** ఈ పటమునందు ఏడు ఇండ్ల స్థలాలు గలవు ఒకటవ నెంబరు ఇంటికి - ఉత్తర దక్షిణములుగా అడ్డముగా ఒక రోడ్డు గలదు. ముఖద్వారానికి ఎదురుగా తూర్పు పడమరలు గాను ఇంకొక రోడ్డు గలదు. ఈ రెండు రోడ్లలో ఉత్తరముపడమరలు ఉండే రోడ్డు కంటె, ముఖద్వారానికి ఎదురుగా ఉండే తూర్పు పడమరలు గాగల రోడ్డు యొక్క వెడల్పు. ఎక్కువగా ఉంది అందుచే ఈ యింటికి వీధి శూల దోషము గలదు.

ఇక రెండవ నెంబరు ఇంటికిని ఇటులనే అడ్డముగా ఉత్తర దక్షిణ రోడ్డును అటులనే ముఖద్వారానికి ఎదురుగా తూర్పు పడమర రోడ్డు అనగా ముఖద్వారానికి ఎదురుగా ఉండే రోడ్డుకు - ఉత్తర దక్షిణ రోడ్డు కంటె వెడల్పు తక్కువగా గలదు. అందుచే వీధిశూల అనే దోషంలేదు. ఇక మూడవ నెంబరు ఇంటి విషయంలో ఈ దోషప్రసక్తియే లేదు.

**దోష పరిహారము:** వాస్తు శాస్త్రవేత్తలను సంప్రదించినచో ఒకటవ నెంబరు స్థలాన్ని సైతము - వీధి శూలలేని విధంగా సవరించి గృహం కట్టుకొనవచ్చును. ముఖద్వారానికి మాత్రమే వీధివేధ అన్నారు గాని ఇంటికి లేదు. అందుచే ప్రవేశానికి గేటును ఉత్తరము అంచునగాని లేక దక్షిణము అంచునగాని శాస్త్రానుగుణ స్థలమునందు ఉంచి గృహాన్ని ఉత్తరముఖ ద్వారంగా గాని లేక దక్షిణముఖ ద్వారంగా గాని నిర్మింపవచ్చును.

చవర్గనామధేయులైన చంద్రయ్య, చెన్నారెడ్డి, జయలక్ష్మి వంటి వారికి ఉత్తర ముఖద్వారము శుభంగా ఉండగలదు. అటులనే సాంబయ్య - శంకరయ్య, సులోచన - సూర్యనారాయణ - హరినాథ్ వంటి వారికిని కొంతవరకు ఉత్తరముఖద్వారం శుభంగానే ఉంటుంది.

ఇక దక్షిణముఖద్వారం - తాతిరెడ్డి తపోధన్ - తాండవకృష్ణ - ధర్మారెడ్డి, దయానంద్ - నాగిరెడ్డి - నారాయణ - నరసింహం వంటి పేర్లు గలవారికి అనగా విశాఖా - అనూరాధా నక్షత్ర జాతకులకు శుభంగా ఉంటాయి.

అందుచే - రోడ్డునకు అనుకూలంగా శాస్త్ర సమ్మతంగా గేటుపడే విధానాన్ని అనుసరించి ఉత్తరముఖద్వారంగానో - దక్షిణముఖద్వారంగానో వాస్తుపురుషాంగ వేధా దోషరహితంగా ఇల్లును నిర్మించుకొనవచ్చును ఏమైనను ఇటువంటి ముఖ్యవిషయాలలో అనుభవజ్ఞులైన వాస్తుశాస్త్రవేత్తలను సంప్రదించడము సముచితము.

**10. కాణవేధా దోషము:** గృహము యొక్క ముఖద్వారానికి ఇరుప్రక్కలను కిటికీలు ఉండవలయును. ఒక ప్రక్కన మాత్రమే కిటికీ ఉన్నచో - కాణవేధా దోషము వచ్చును.

**ఫలము:** ఈ కాణవేధా దోషము గృహవాసులకు నేత్రరోగము అంధత్వము మొదలైన దోషాలను గల్గిస్తుంది.

**వివరణ:** కిటికీలు సరిసంఖ్యలో ఉండవలయును అని నియమం గలదు. ద్వారానికి ఒక ప్రక్కన గదివచ్చునట్లు ఉన్నచో గదిలో పడునట్లుగానైనను రెండవ కిటికీని ఉంచవచ్చును - తుదకు కిటికీకి పైన అయినను ఇంకొక కిటికీని అమర్చిననూ ఈ దోషం కొంతవరకు శాంతింపవచ్చును.

**11. వైకల్య వేధా దోషములు:** గృహము యొక్క లోపలి భాగము యొక్క బేసి మట్టమునకు సమముగా ముఖద్వారముగాని తక్కిన ద్వారాలు ఉండవలయును - బేసి మట్టమునకు ఎత్తునగాని తగ్గున గాని ద్వారాలు ఉండరాదు. అటుల ఉన్నచో వికలత - లేక వైకల్యము అనే వేధాదోషం సంభవిస్తుంది.

**ఫలము:** ఈ - వికలతా దోషవేధ అనేది గృహవాసులకు అన్ని కార్యాలయందు వికలతనే అనగా శుభరాహిత్యాన్నే గల్గిస్తుంది.

**వివరణ:** ద్వారా బంధము (కడప) క్రింద ఉండే బండలేక సిమెంటు స్లాబ్, ఇంటి బేసి మట్టమునకు అనగా లోపలి భాగానికి. సమానంగా ఉండడం సర్వసమ్మతమైన పద్ధతి అగును కొందరు లోపలిభాగముకంటె ఒక అర్ధ అంగుళము, అంగుళము ఎత్తుగా ఉండవచ్చును అందురు. అంతకుమించి మాత్రము ఎత్తు ఉండరాదు. అలా ఉండినచో ఇంటిలోనికి దిగినట్లుగా అగును - కూర్మపృష్ట స్థితిగా - బేసి మట్టము ఉండవలయుననెడి మూల సిద్ధాంతాలకు భంగం వాటిల్లును. అర్ధ అంగుళం లేక అంగుళం ఎత్తు ఉన్నను ఒక ప్రక్కగా గోడకు చిన్నకన్నం - ఇంటిలోని నీరు అనగా ఇంటిని కడిగిన నీరు - వెలుపలికి వచ్చుటకు తగిన విధంగా ఉండవలయును - ఇంటిలో గానీ, ఇంటి కప్పుపైగానీ నీరు ఏమాత్రం నిలువరాదు అనేదియే వాస్తుశాస్త్రకారుల సిద్ధాంతం అని తెలియదగును. కృష్ణవాస్తుకారుని ఈ పద్యమును పరిశీలించండి.

*కం౹ మిట్టతలన్ ద్వారంబును*
*నెట్టన దగ్గయినచోట - నిలయంబువెసన్౹*
*గట్టినమేలు దొలంగును*
*కొట్టమువెనుగాడినడువ - గూడదునిడివిన్॥*

**భావము:** వాకిలిని ఎత్తుగా బెట్టి తగ్గుగా ఇల్లుగట్టరాదు. అట్లు కట్టిన యింటిలో నివసించేవారికి సిరులు - తగ్గిపోవును. అనగా తొలగిపోవును. కొట్టములో - నడుమ ఉండే వెనుగాడి క్రింద నిడివిగా నడువరాదు. భోజరాజు తన సమరాంగణ సూత్రధారములో ఈ దోషాలను, వీటి చెడు ఫలాలను ఇలా వివరించాడు.

నిమ్నోన్నంతం కరాళంచ - సమ్ముఖం పృష్ఠదేశగమ్,
వామావర్తంచనశుభం ద్వారమగ్రతరంగృహే ॥

**భావము:** ఇంటి బేసి మట్టమునకు తగ్గునగానీ - అలాగే ఎత్తున గాని ద్వారము అనగా ముఖద్వారముగానీ ఇతర ద్వారాలు ఉండరాదు. ఇక ముఖద్వారము తక్కిన ద్వారాలకంటె కొంత పెద్దగా అందముగా చిలుకలు - పుష్పలతలు - మొదలైన శుభవస్తువులతో చిత్రములతో యధాశక్తి నిర్మించుకొనవచ్చును. పాములు గద్దలు - పులులు, సింహాలు వంటి భయంకర ప్రాణుల చిత్రాలతో ఉండరాదు. ప్రాకారద్వారానికి అనగా కాంపౌండు గేటుకు ఎదురుగా ముఖద్వారం ఉండరాదు. ముఖద్వారానికి కుడిప్రక్కగా కాంపౌండు గేటు ఉండదగును. అటుల ఉన్నచో ఇంటి ద్వారము ప్రదక్షిణ మార్గమున ఉండును. ఇంటికి వెనుక భాగమున ముఖద్వారం ఉండరాదు.

అటులనే ప్రధాన గృహమును వీడి వసారాలో ముఖద్వారము ఉండరాదు. ఇటుల ఉన్నచో దుష్టఫలాలు సైతం ఇటుల వివరింపబడినాయి సమరాంగణ సూత్రాధారములో.

శ్లో॥ నిమ్నేస్యాత్ స్త్రీజితోభర్తా దుర్జనస్థితిరున్నతే,
సమ్ముఖేసుతపీడాస్యాత్ ప్రేష్ఠగే చపలాస్త్రియః॥
వామే విత్తక్షయోనాశోభవ త్యగ్రతరే ప్రభోః
ద్వారం తస్మాన్నకర్తవ్య మీదృగ్రూపంవిచక్షణైః॥

**భావము:** తగ్గున ముఖద్వారం ఉన్నచో గృహస్వామి, స్త్రీలకు వశ్యుడు అగును. ఎత్తున ముఖద్వారం ఉన్నచో యజమానుడు దుర్జన స్నేహాలు గలవాడు అగును, కాంపౌండు గేటుకు ఎదురుగా ముఖద్వారం ఉన్నచో సంతానపీడగల్గును, ఎడమ చేతి మిదుగా అనగా అప్రదక్షిణముగా గేటునుండి ప్రవేశించునట్లు ముఖద్వారం ఉన్నచో, గృహస్వామికి హానియును గల్గును.

**విశేషము:** 'సుతపీడా' పదాన్ని రెండు విధాలుగా వ్యాఖ్యానిస్తారు.

1. సుతాత్పీడా = సుతుని వలన బాధ
2. సుతస్యపీడా = సుతునికి బాధ

రెండును దుష్టములే అగును, గనుక గృహద్వారంలో నిలుచున్నచో కుడిప్రక్కగా కాంపౌండు గేటు ఉన్నచో రెండును దుష్టములే అగును, గనుక గృహద్వారంలో నిలుచున్నచో కుడిప్రక్కగా కాంపౌండు గేటు ఉన్నచో

రెండు దోషాలును అనగా సమ్ముఖదోషము వామావర్త దోషము రెండు దోషాలు తొలగును ఈ విషయమును గుర్తించడం శుభం అని తెలియదగును.

## 12. తూలాది వేధా దోషములు:

నాగదన్త తులాస్తంభబిత్తి మూషా గవాక్షకాః,
ద్వారమధ్యేనదాతవ్యాః నచైతేవిషమస్థితాః,
(సమరాంగణ సూత్రధారము - భోజరాజు)

**భావము:** నాగదన్తములు అనగా ఏనుగు దంతాల వలె ఉండే కఱ్ఱలు - దూలములు - స్తంభాలు - గోడలు - మూషలు కిటికీలు - ద్వారానికి నడుమ ఉండరాదు - ద్వారాన్ని తప్పించి ఉన్నను ఇవి బేసి సంఖ్యలో ఉండరాదు.

**వివరణ:** ఏవేని వస్తువులు తగిలించుకొనడానికి ఏనుగు దంతాల వలె కొంత వంకరగా తయారుచేయించిన దారు విశేషాలు (కఱ్ఱలు) నాగదంతములు అనబడును. ఇవి ద్వారము మీదగాని ద్వారానికి ఎదురుగా ఇంటిపై భాగాన ఉండే దంతెలకు కట్టబడిగాని లేక సిమెంటు స్లాబునకు అమర్చబడిగాని ఉండరాదు.

**తులా = దూలములు:** ఇవి ద్వారముపైన ఉండరాదు. ఒక దూలముగాని పెక్కు దూలాల కలయికగాని ద్వారంపై ఉండరాదు.

**భిత్తి = గోడ:** ద్వారము మీద బరువుగా గోడను పెట్టరాదు. అనగా ద్వారముపైన ధృడమైన బండను గాని - లేక సిమెంటు స్లాబును గాని ద్వారము రెండు ప్రక్కల గోడలపైకి వచ్చునట్లుగా వేసి ద్వార బంధానికి బరువు పడనట్లు చూడవలయును.

ద్వారముపై బరువుగా గోడలే ఉండరాదు అనుటవలన సామానులు ఉంచి అధికభారాన్ని గల్గించే అటకలు - అని ప్రత్యేకంగా తెల్పనవసరంలేదు. ద్వారంపై అటకలు ఉంచడమే గాక వాటిపై చెప్పులు పారకలు ఉంచరాదు - అని ప్రత్యేకంగా తెల్పనవసరంలేదు. ద్వారాలపైన శుభమైన దేవతా ప్రతిమలుగాని, పటాలు వంటి వస్తువులు సైతం ఉంచడం కొన్ని ఇండ్లలో కలదు. ద్వారాలపైన శుభమైన దేవతా ప్రతిమలుగాని, పటాలు గాని, ఉంచి - ఆ దేవతల పాదాలక్రిందుగా ఇంటిలో ప్రవేశించడం శుభంగల్గిస్తుంది గాని పారకల క్రిందను చెప్పుల క్రిందుగాను నడవడంలోని ఔచిత్యాన్ని పాఠకులు గ్రహింతురు గాక!

**ముషా: మూషములు**

బంగారు, వెండి మొదలైన ధాతువులను కరిగించే వర్తులాకారపు చిప్పను మూష - లేక మూస అందురు. అయితే ఈ మూషకు క్రింది వైపున రంధ్రం ఉండదు. ఇచ్చట వాస్తుశాస్త్రంలోని మూషకు - వర్తులాకారత అనగా గుండ్రంగా ఉండడం అనేది కంసాలి మూసకువలె సమానమే అయినను - మూషకములు అనగా ఎలుకలువేసే తొల్లలవలె రెండు ప్రక్కలను ద్వారాలు గల్గి - గాలి వెలుతురు, గృహంలోనికి పోవుటకు వీలుగా ఉండును. దీనిని గుండ్రని కిటికీ అనవచ్చును.

**సమరాంగణ సూత్రధారములోని ఈకారికలు చదువుడు:**

> "అలిందశాలయోర్మధ్యేయాస్యాన్మూషేతిసాస్మృతా।
> అలిందాఇతికాప్యాహు ర్మూషాఇత్తపరేజగుః ।
> భద్రాఇతిజగుఃకేతి దన్యేపరిసరాఇతి ।
> ఏకమూషామమూషాంచశాలాకుర్యాత్కదాచన" .
>
> (ఇత్యాదికము)

**భావము:** అలిందము అనగా వసారా ! వసారాకును ప్రధాన గృహానికి మద్యన వర్తులాకారంగా ఉండే ఒకానొక విధమైన గవాక్షాన్ని మూష అందురు - చోరులు మొదలగు వారివలన భయంలేకుండుటకై వీటిలో కిటికీలకువలె ఇనుపచువ్వలు సైతం బిగిస్తారు. కొందరు అందానికై వీటిచుట్టూ బంగారు - వెండీ ఇత్యాది నగీషీపనులు సైతం చేయిస్తారు.

ఈ మూషలనే కొందరు అళిందాలు అనియు, మరికొందరు భద్రములు అనియు, వేఱొకరు పరిసరములు అనియు అందురు.

ఈ మూషలను గురించి అధికంగా తెలియగోరేవారు సమరాంగణ సూత్రధారమును పఠింపగలరు.

**ప్రస్తుతాంశము:** ఇలాంటి మూషలు ద్వార బంధముపై ఉంచరాదు.

**గవాక్షములు:** కిటికీలు: పూర్వము కిటికీలను ఎద్దు కన్నులవలె గుండ్రంగా ఇంటికి పై భాగంలోను చుట్టు గోడలయందును ఏర్పాటు చేసుకొనడం అనేది ఆచారంగా ఉండేది. వీటివలన ఇంటిలోనికి గాలి - వెలుతురు

వస్తాయి. వంటయింటిలోని పొగ వెలుపలికి పోవడానికి ఈ గవాక్షాలు మిక్కిలి ఉపయోగపడుతాయి. క్రమంగా ఈ గవాక్షాలు సమచతురస్రాలుగాను, దీర్ఘచతురస్రాకారాలుగాను మారినాయి, నేడును కొందరు వంటగదులలో వెలిగోడకు పై భాగాన గుండ్రని కిటికీని ఏర్పాటు చేసి దానిలో ఫ్యానును బిగిస్తారు ఉదయము వంటయింటి యొక్క తలుపును తెరవగానే ఫ్యాను యొక్క స్విచ్చును నొక్కుతారు. అప్పుడు ఫ్యాను ద్వారా వంటయింటిలోని గాలి అంతయును వెలుపలికి పోవును - తర్వాత వంటయింటిలో అడుగు పెట్టెదరు. గ్యాస్ లీకేజి ద్వారా ప్రమాదం గల్గని విధంగా ఫ్యాను యొక్క స్విచ్చును వంటగది ద్వారానికి వెలి ప్రక్కనే ఏర్పాటు చేసికొనడం సైతం గలదు.

ప్రస్తుతాంశము: ఈ గవాక్షాలు గానీ, కిటికీలుగాని, ద్వారాలపై ఉండరాదు.

**ఈ శ్లోకము ద్వార గ్రహింపదగిన మరికొన్ని విషయాలు:** గోడ అనేది ద్వారబంధముపై బరువుగా ఉండరాదు అన్నాము - అంతేగాదు - **ద్వారమధ్యే = ద్వారము యొక్క నడుమ** అనుటచే - ద్వారానికి ముందు ప్రక్కనగాని, లో ప్రక్కన గాని ఏ విధమైన గోడమూల పోటు ఉండరాదు.

లో ప్రక్కన అనుటచే తనయింటిలోని గోడమూల పోటు అనియు - వెలి ప్రక్కన అనుటచే ముఖద్వారం విషయంలో అయినచో పరునియింటి గోడమూల పోటు అనియు తెలియదగును. యింటిలోపల ఉండే ద్వారాల విషయంలో అయినచో - ముందు వెనుకల ఉండే గోడమూలల పోటు తన యింటిలోనివి యే అనియు గ్రహింపదగును. ఈ విధంగా, గోడమూలల పోటులు గల్గి - లోపలి ద్వారాలు గాని - ముఖద్వారం గాని ఉండరాదు. ఇటులనే స్తంభాల పోటులును ఏ ద్వారాలకు ఉండరాదు.

## 13. ద్వార వేధా దోషము:

ఈ గ్రంథము యొక్క రెండవ భాగములో 15 మరియు 16 శీర్షికలందు ముఖద్వారాలును ఉపద్వారాలును గృహానికి ఎచ్చట ఉంచవలసినదియు కొంత వరకు వివరింపబడింది.

నేటి ఆధునిక వాస్తు శాస్త్రకర్తలు ద్వారాల విషయంలో - లేని పోని సమస్యలను సృష్టిస్తున్నారు.

ద్వారమునకు ఎదురుగా ద్వారము లేక పోవుటయును ద్వావేధ - అని వీరు అనుచున్నారు. అటుల అనుటయే గాదు. ప్రారబ్దవశమున గల్గినట్టి ఆపదలకు ద్వారములు వరుస దప్పి ఉండడమే దోషముగా బోధిస్తున్నారు - సరిగా శాస్త్ర సమ్మతంగా ఉండే ఉపద్వారాలను అనగా లోపలి ద్వారాలను తీయించి ముఖద్వారానికి ఎదురుగా బలవంతంగా పెట్టిస్తున్నారు. పోనీ, ఇందువలన ఆపదలు పోవుచున్నవా అంటె అదియును లేదు. వాస్తవానికి ద్వారవేధా దోషమనగానేమిటో వివరంగా తెల్పుచున్నాను.

విశ్వకర్మాదుల మతమును అనుసరించి గోడమూల పోటువలెనే ఒక ద్వారానికి ఇంకొక ద్వారం యొక్క మూల యొక్క పోటు ఉండుటయే ద్వారవేధ అగును విషయం స్ఫుటంగా తెలియుటకై పటము వ్రాయుచున్నాను.




**వివరణ:** ఇది తూర్పు ముఖద్వార గృహము

తూర్పున జయన్తస్థానము నందు ముఖద్వారం గలదు ఉపద్వారాలు=పర్జన్య - భృశ స్థానములందు గలవు. ఇలా ఉండడం అనేది వాస్తుశాస్త్ర సమ్మతమే అగును - వాస్తుపురుషాంగ వేధారహితంగా ఇలా ఉండడం శుభమే అగును. కాని ఆధునికులు ద్వారాలు వరుస తప్పడం వలన దీనిని ద్వార వేధాదోషం అనుచున్నారు. ప్రాచీనుల ప్రకారం అయినచో ద్వారవేధాదోషం ఈ క్రింది విధంగా ఉండును.



**వివరణ:** ఇచ్చట ముఖద్వారానికి ఉపద్వారము యొక్క అంచు పోటుగా ఉంది. ఈ ద్వారావేధా దోషాన్ని ప్రాచీనులైన విశ్వకర్మాదివాస్తు శాస్త్రకారులు నిషేధించారు అనగా గృహంలో ద్వారాలు ఇటుల ఉండరాదు అన్నారు. నేటి స్వానుభవవాస్తు శాస్త్రరచయితలును దీనిని దోషంగానే పేర్కొన్నారు.

ఇట్టి ద్వారావేతధాదోషాలు గల్గిన గృహాలు - దారిద్ర్యాన్ని దుఃఖాన్ని అశాంతిని గల్గిస్తాయి అని శాస్త్రకారులు పేర్కొన్నారు.

**14. తూలవేధా దోషము:** దూలముల క్రింద నడుచునట్లుగా ముఖద్వారం ఉన్నచో తూలవేధా దోషం గల్గును.

**ఫలము:** ఇది అనారోగ్యం - అశాంతి - కలహం ఇత్యాది అశుభాలను గల్గిస్తుంది.

**గమనిక:** ప్రాచీన వాస్తు శాస్త్రకారులు ద్వారవేధా దోషాలను ఇంకను కొన్నింటిని పేర్కొన్నారు. అవి అనుభవంలోనే సరిపడడం సరిపడకపోవడం అనేది ఏ విధంగా ఉన్ననూ అటుల గృహం నిర్మించడం - నేటి ఆధునిక కాలంలో చాలా వరకు అసంభవం అనియే తలపందగును.

**ఉదా:** 1. ఎదురింటి దీపకాంతి, తన యింటియొక్క ముఖద్వారంపై పడరాదు అందురు. పూర్వం తైల దీపాలు గనుక అదికొంత వరకు సాధ్యమగునేమో గాని నేటి ఎలెక్ట్రిక్ - యుగంలో ఇది సాధ్యం గాదు. ఎదురింటి పంచలో బార్‌లైట్ వంటిదానిని అమర్చినచో తనయింటి ముఖద్వారంపై పడకుండా ఆపడం సాధ్యమా!

2. ఎదురింటి పృష్ఠద్వారానికి - అనగా వెనుకటి ద్వారానికి ఎదురుగా తనయింటి ముఖద్వారం ఉండడం సైతం ద్వార వేధాదోషం అన్నారు!

ఈ దోషాన్ని తొలగించడం అనేది కొన్ని యెడల సాధ్యం అగును - కొన్ని యెడల సాధ్యం గాక పోవచ్చును. అటుల ఈ దోషాన్ని తొలగించేందుకై, తనయింటి ద్వార స్థానాన్ని మార్చినచో అది జయన్తమహేంద్రాది ద్వారస్థాపన యోగ్యస్థలముగాక పోవచ్చును.

ఈ విషయాలలో అనుభవజ్ఞులైన వాస్తు శాస్త్రజ్ఞులను సంప్రదించడము శుభము.

## 12. ద్వారబంధ విషయములో - ఆయము

**ఆయమును కనుగొను విధము:**

ద్వారము యొక్క ఎత్తును వెడల్పును గుణింపగా వచ్చే అంకెకు పదము అని పేరు. దానిని తొమ్మిదిచే గుణించి ఎనిమిదిచే భాగింప వలయును. ఇచ్చట లబ్ధమును వదలివేయవలయును - భాగింపగా వచ్చే శేషమును బట్టియే ఆయమును తెలిసికొనవలయును.

పదమును తొమ్మిదిచే గుణించి ఎనిమిదిచే భాగింపగా శేషము ఒకటి అయినచో ధ్వజాయము రెండు శేషమైనచో దూమయము, మూడు శేషమైనచో సింహాయము, నాల్గుశేషము అయినచో శ్వానాయము, అయిదు శేషము అయినచో వృషభాయము, ఆరుశేషము అయినచో ఖరాయము, ఏడు శేషము అయినచో గజాయము, ఎనిమిది శేషము అయినచో కాకాయము అని తెలియవలయును.

ఈ ఎన్మిది ఆయములలో ధ్వజ - సింహ ,వృషభ, గజములు అనే నాల్గు ఆయములే ప్రశస్తములైనవి.

**ఉదా:**

ముఖ్యద్వారము ఎత్తు 9 అడుగులు
వెడల్పు 5 అడుగులు గలదు
అప్పుడు పదము 9×5 = 45 అగును
దీనిని 8 చే భాగింపగా శేషము 5 వచ్చును.

ధ్వజ వృషభాయములు సాత్వికములు గనుక అందరికిని ఉపయోగపడును. సింహ గజాయములు రాజసములు అగుటచే క్షాత్రగుణము గల వారికి - అనగా రాజకీయ నాయకులకును ఉన్నతోద్యోగులకును తగినవియై యుండును అందురు.

తమ జన్మ నక్షత్రమును బట్టిగాని లేక వ్యవహారనామమును బట్టిగాని తమకు తగిన ఆయమును జ్యోతిష్కుల ద్వారా తెలిసికొనదగును. స్వవర్గాత్ పంచమోవర్గః శత్రుః - అనగా తమ వర్గాక్షరమునకు పంచమ వర్గాక్షరము శత్రువని నిర్దేశించారు. అందుచే అయిదవవర్గమునకు సంబంధించిన ఆయమును వదిలి తక్కిన ఆయముగల్గిన కొలతతోడి ద్వారబంధమును ఉపయోగించి శుభములు పొందుట సముచితము.

**ఉదా:** రామమూర్తి అనే వ్యక్తి - తన గృహానికి ద్వారబంధమును ఏర్పాటు చేసికొనదలచాడు అది ఎట్టి ఆయముతో ఉండవలయును - అని ప్రశ్న.

**సమాధానము:** రామమూర్తి అనే పేరునందు రేఫము మొదటి అక్షరము రేఫము యవర్గములో చేరును. యవర్గజన్తువు ఏనుగు అగును. యవర్గమునకు అయిదవ వర్గము చవర్గము అగును చవర్గప్రాణి సింహము అగును. సింహానికి, ఏనుగునకు బద్ధవైరము అని అందరెఱుంగుదురు. అందుచే సింహాయము తోడి ద్వారబంధము పనికి రాదు. ధ్వజ వృషభాయములతోడి ద్వారబంధము మాత్రమే పనికి వచ్చును. అటులనే గజాయమును ఉంచవచ్చును. అందుకు తగినట్లుగా పూర్వోక్త కొలతలు గల్గిన (9×5=45) అనగా తొమ్మిది అడుగుల ఎత్తు 5 అడుగుల వెడల్పు గల్గిన వృషభాయముతోడి ద్వారబంధము తగియుండును. ఈ కొలతలకు వృషభాయము ఏవిధంగా వచ్చేది ముందుగానే చూపబడినది.

## 13. ద్వారబంధాది విషయంలో యోగ్యదారువులు

లోకంలో ప్రతివారికిని శత్రుమిత్రులు ఉన్నట్లుగానే నక్షత్రాలకు శత్రుమిత్ర నక్షత్రములు ఉండును. ప్రతినక్షత్రానికి ఒకానొక వృక్షము ఉండును. అందుచే తన నక్షత్రానికి శత్రు నక్షత్రమును వదలి నట్లుగానే శత్రు నక్షత్ర వృక్షాన్ని సైతం ద్వారబంధాది ముఖ్యమైన గృహనిర్మాణ పరికరములందు త్యాజ్యములని వాస్తు శాస్త్రకారులు అందురు.

**ఉదా:** రామమూర్తి

పే-పో-రా-రీ= చిత్త! అనే నియమాన్ని అనుసరించి రామమూర్తికి చిత్రాతృతీయ పాదము వచ్చును. చిత్రానక్షత్రము ద్విపాదనక్షత్రము దీనికి తక్కిన ద్విపాద నక్షత్రములైన మృగశిర్షా ధనిష్టలు శత్రుతారలు ఈ శత్రు వృక్షనక్షత్రాలు - చంద్రవృక్షమును జమ్మిచెట్టును అగును - కనీసము వీటినైన నీడుట శుభము.

శత్రునక్షత్రాలును శత్రునక్షత్ర వృక్షాలును జ్యోతిష శాస్త్రపరిచయంచే తెలియదగినవియై యుండును. పండితులను సంప్రదించడము శుభము అని తెలియదగును.

ఇట్టి స్థితిలో వాస్తు శాస్త్రమునకు జ్యోతిషాది శాస్త్రములతో సంబంధము లేదు, అనడం ఎంతటి అవివేకమో, పాఠకులు గుర్తింపగలరు.

## 14. ముఖద్వారమునకు ఇరువైపుల గూళ్లు ఉంచడంలోని ఫలము

మన భారతదేశము అధ్యాత్మిక పుణ్యాభూమి మన ప్రార్దనలో - ముఖ్యంగా.
అసతో మా సద్గమయ = అశాశ్వతము నుండి శాశ్వతానికి చేర్చుము.
తమసోమా జ్యోతిర్గమయ - చీకటి నుండి వెలుగునకు చేర్చుము.
మృత్యోర్మామమృతంగమయ - మృత్యువు నుండి అమృతస్థితికి చేర్చుము.
అనే సూక్తులు అవినాభావంగా చోటుచేసికొని ఉంటాయి.
తమస్సు అనగా చీకటి, అజ్ఞానానికి జ్యోతి అనగా వెలుగు అనేది జ్ఞానానికి ప్రతీకలు అగును మరియు

'ఆరోగ్యంభాస్కరాదిచ్చేత్ శ్రియ విచ్ఛేద్దుతాశనాత్

అనే సూక్తిని అనుసరించి సూర్యరూపమైన జ్యోతి వలన ఆరోగ్యము గల్గుననియు అగ్ని రూపమైన జ్యోతివలన సంపదగల్గుననియు మన శాస్త్రాలు బోధిస్తున్నాయి. అందుచే ఆరోగ్యానికి, ధనధాన్యాది సంపదలకు ద్వార లక్ష్మి దగ్గర దీప జ్యోతిని వెల్గించి స్వాగతం పల్కడం మన సంప్రదాయము. కనుక ద్వారమునకు ఇరుప్రక్కలను దీపములు ఉంచడానికి అనువుగా గూళ్లను ఏర్పాటు చేయవలయును. ఈ గూళ్లు అనేవి ఇంటి బేసి మట్టమునుండి మూడు అడుగుల ఎత్తునకు పైగానే ఉండును. గూడులోపల ఉండడం వలన ఇందుంచిన దీపాలు గాలి తాకిడికి సామాన్యముగా ఆరిపోవు, ద్వార విషయాలను అధికంగా తెలియగోరే వారు శాస్త్రజ్ఞులను సంప్రదింపగలరు.

## 15. కాంపౌండు గేటు విషయము మరియు అంతర్ద్వారాల విషయము

శ్లో॥ అంతర్ద్వారాత్ బహిర్ద్వారం నోచ్ఛంకుర్యాత్
నసంకటమ్ ఉచ్ఛం విసంకటంవాపి తచ్ఛినాయ నజాయతే॥
(సమరాంగణ సూత్రధారము - భోజరాజు)

**భావము:** లోపల ఉండే గృహము యొక్క ముఖద్వారము కంటె వెలుపల ఉండే గేటు యొక్క ద్వారము ఎత్తుగా ఉండరాదు. అటులనే సంకటముగాను అనగా ఇరుకుగాను ఉండరాదు. అవసరము అయినచో ఎక్కువ వెడల్పు గలదానిని ఏర్పాటు చేసి కొనవచ్చును గాని ఎత్తు గల దానిని మాత్రము ఉంచరాదు. అది శుభము గల్గింపదు.

ఇదే విధంగా ముఖద్వారానికి లోపల ఇంటిలో ఉండే ఉపద్వారాలను ముఖద్వారం కంటె ఎత్తుగా ఉంచరాదు. తల తగలని విధంగా కొంత తగ్గించినను దోషము లేదు. వెడల్పు విషయంలో మాత్రం అవసరానికి అనుగుణంగా కొంత పెంచినను తగ్గించిననూ దోషం లేదు. సంకటంగా అనగా ఇరుకుగా మాత్రం ఉండరాదు. సామాన్యంగా ఇద్దరు ఒకేసారి ప్రవేశించిననూ ఎదురెదురుగా వచ్చిననూ - ఏదేని బక్కెట్ వంటి దానిని చేత పట్టుకొని వచ్చిననూ ఇబ్బంది లేని విధంగా ఉపద్వారాలు ఉండవలయును ఈ నియమము స్నానపు గదులు మొదలైన వాటి విషయంలోను వర్తించును అని తెలియదగును.

**విశేషము:**

అంతర్ద్వారాత్ బహిర్ద్వారం నోచ్ఛంకుర్యాత్

అనగా ముఖద్వారాదులకంటె ప్రాకారద్వారమును ఎత్తుచేయరాదు. ఇత్యాది రూపమైన ఈ నియమము దేవాలయములు రాజ భవనాలు మొదలైన విశేష నిర్మాణాల విషయంలో ప్రవర్తింపదు. ఇందుకు ప్రత్యక్షోదాహరణలు - ప్రసిద్ధాలైన తిరుమల తిరుపతి, శ్రీకాళహస్తి, శ్రీశైలం వంటి స్థలాలలోని దేవాలయాలే అగును. అచ్చటి ప్రాకార

ప్రవేశద్వారాలైన గాలిగోపురాలు, దైవమందిర ముఖద్వారాలకంటె ఎంతో ఉచ్చమైనవి. గజరాజములు తమ మూపురములందు మావటీంద్రుని వసించియు సంచరింపవీలైనంత ఎత్తు గలవిగా ఉన్నాయి.

రాజ భవన ప్రాకారాలను కోటలు అందురు. వాటి ప్రవేశద్వారాలు వెడల్పునందును, ఎత్తునందును రాజభవనము ముఖద్వారాల కంటె అధికంగానే ఉంటాయి. ఇవియును అశ్వగజ సంచార యోగ్యములై ఉండును.

అందుచే పైనియమము - సామాన్యశ్రీమంతుల భవనాలకు మాత్రమే అని తెలియదగును. నేడు పెద్ద పెద్ద యంత్రాలయాలకు సువిశాలమైన కాంపౌండు ఉండును. యంత్రాలయాలకు అవసరమైన ముడిపదార్థాలను తెచ్చుటకును, తయారైన వస్తువులను తీసికొనిపోవుటకు భారీ వాహనాలైన లారీలు క్రేనులు సైతం వస్తూంటాయి. బిర్లా టాటా వంటి ప్రముఖ వ్యాపారస్థుల యొక్క యంత్రాలయాలలోనికి రైలు మార్గం సైతం గలదు. వీటిని అన్నింటిని పరిశీలించినచో పై నియమము సామాన్య భవనాలకే గాని విశిష్ట నిర్మాణాల విషయంలో వర్తింపదు అని తెలియదగును.

ఇంకను ద్వారాల విషయంలో సమరాంగణసూత్రధార - విశ్వకర్మ వాస్తు అపరాజితపృచ్ఛ - ఇత్యాది గ్రంథాలలో ఎన్నియో విషయాలు గలవు అవియన్నియును వ్రాసినచో గ్రంథము మిక్కిలి పెరిగిపోవును. సామాన్య నిర్మాణాలకు ఈ మాత్రము విషయాలు చాలును. అని తలంచి ఈ ద్వార విషయకమైన చర్చను ఇంతటితో ముగించుచున్నాను. జిజ్ఞాసువులు సమరాంగణ సూత్రధారాది గ్రంథాలు పఠింతురు గాక లేక శాస్త్రజ్ఞులను సంప్రదింతురు గాక.

## 16. గోడల విషయము

### 1. ప్రహరీ గోడలు

గృహ నిర్మాణము చేయదలచిన వారు - దిక్సూచీ సహాయముచేగాని లేక ఇతర విధంగా గానీ - స్థలమునకు దిక్కులు తెలుసుకొనవలయును. పిమ్మట శల్యాది దోషరహితముగా స్థలమును విశుద్ధము చేయవలయును. నిశ్చితమైన స్థలమునకు మొదటి ప్రహరీ గోడను వాస్తు సిద్ధ శుభముహూర్తము ఆరంభించి కట్టవలయును.

ఈ గోడలను సైతము ఈశాన్యదిక్కుతో ఆరంభించి తూర్పు ఉత్తర గోడలను పెట్టవలయును. అనగా తూర్పు గోడను ఆగ్నేయము వరకు నిర్మింపవలయును.

పిమ్మట నైరుతి మూలతో ఆరంభించి - దక్షిణ పశ్చిమ గోడలను ఆగ్నేయ వాయవ్యములందు పూర్వనిర్మిత గోడతో కలుపవలయును. అనగా నైరుతి కోణమున ఆరంభించి దక్షిణ గోడను నిర్మింపవలయును. దానిని ఆగ్నేయమునందు తూర్పు గోడతో సంధింపవలయును. పిమ్మట నైరుతి నుండి పడమటి గోడను ఆరంభించి దానిని వాయవ్యమునందు ఉత్తరపు గోడతో సంధింపవలయును. తూర్పు పడమరల నందు గోడలు సమానమైన పొడవుగల్గి ఉండవలయును. అటులనే ఉత్తర దక్షిణ గోడలును సమానమైన పొడవు గల్గి ఉండవలయును. నాల్గు మూలలందును మూల మట్టము సరిపడియుండవలయును. అటుల సరిపడిననే రెండు కోణములు కొలతలు సరిగా వచ్చును. అనగా ఈశాన్యము నుండి నైరుతికి ఉండే కొలతయు - ఆగ్నేయమునుండి వాయవ్యమునకు ఉండే కొలతయు సమానముగా వచ్చును. అటులరానిచో ఎక్కడనో పొరపాటు ఉన్నది అని గ్రహింపవలయును.

నిపుణుడైన శిల్పి, గోడలను పెట్టుటకు ముందుగా దిక్కులను సాధిస్తాడు. అటుపిమ్మట నాల్గు దిక్కులకు మధ్యభాగములందును నాల్గు కోణాలకు మధ్య భాగాలయందును మేకులను (గుంజలను) దృఢంగా పాతును.

రెండు కోణముల కొలతలను సరిగా ఉండునట్లు సవరిస్తాడు. అటుపిమ్మట పూర్వోక్తవిధంగా పొరపాటు జరగడం అనేది సామాన్యంగా ఉండదు.

ప్రాకారపు గోడలను అనగా చుట్టూ ఉండే ప్రహరీ గోడలను కట్టకుండా ప్రధాన గృహనిర్మాణాన్ని తలపెట్టరాదు. వర్తులాకార స్థలంలోను, వాలు స్థలాలలోను పరిమితమైన ఎత్తులోనైనను ప్రహరీగోడలను కట్టడం అవసరం అని తలంపవలయును. ప్రహరీగోడలను కట్టనిచో పరిసర ప్రదేశాలనుండి గాని పరిసరగృహాలనుండి, తాను గృహం నిర్మింపదలచిన స్థలంలో అపరిశుద్ధ పదార్థాలు వచ్చి చేరడానికి అవకాశం ఉండును. మరియు ప్రహరీగోడ నిర్మాణం ద్వారా, స్థలవిషయంలో ఇరుగుపొరుగు వారి ద్వారా ఏవేని పేచీలు ఉన్నచో తొలగిపోవును. ఈ ప్రహరీగోడకు శాస్త్రోక్తస్థలంలో అవసరమైనంత వైశాల్యంతో గేటు ఏర్పాటు ఉన్నచో గృహనిర్మాణార్థమై, తెప్పించిన వస్తువులకును కొంత భద్రత గల్గును.

**2. పిశాచస్థాన నిర్ణయము:**

పిశాచస్థానము అనేది ప్రధాన గృహానికి చుట్టూ వదలబడే స్థానంగా ఉంటుంది. గృహలక్ష్మి చుట్టును ప్రదక్షిణం చేయడానికిని శాస్త్రోక్తములైన వృక్షలతాదులు పెంచుకొనడానికి, బావి, బోర్ మొదలైనవాటిని ఏర్పాటు చేసుకొనడానికిని - వాహనాలు ఉంచుకొనేందుకును విందులు వినోదాలు వివాహాదులు మొదలైన సందర్భాలయందు పందిళ్లు వేయడానికిని ఈ స్థలాన్ని ఉపయోగిస్తారు.

పిశాచ స్థలవైశాల్యాన్ని అనుసరించి అందులో కొందరు శ్రీమంతులు వర్తులాకారంగా వంటగదియు స్నానపుగది శౌచగృహము (మలవిసర్జనశాల) మొదలైన వాటిని ఏర్పాటు చేయవచ్చును. అయితే ఇవి ప్రధాన గృహాన్ని తగులని విధంగా మిక్కిలి జాగ్రత్తగా శాస్త్రీయంగా నిర్మింపవలసియుంటాయి. వసతిని బట్టి పరిచారకుల గృహాలను సైతం నిర్మించడంలో దోషంలేదు.

తూర్పు ఉత్తరములందు ఖాళీ స్థలము ఎక్కువగా ఉండవచ్చును. అందుచే కేవలము గృహాన్ని నిర్మించే స్థలాన్ని మాత్రమే పరిగణనలోనికి తీసికొనవలయును.

వాస్తుపద విన్యాసాలలో మూడు మాత్రమే మిక్కిలి ప్రసిద్ధములైనవి అవి. 1. శత పదవాస్తువు, 2. ఏకాశీతి పదవాస్తువు, 3. చతుష్షష్టి పద వాస్తువు

గృహ నిర్మాణ స్థలాన్ని తూర్పు పడమరలుగా పదిసమాన భాగాలుగాను ఉత్తర దక్షిణములుగా పదిసమాన భాగాలుగాను విభజించినచో (10×10×=100) శతపద వాస్తువు అగును. ఇటులనే తొమ్మిది తొమ్మిదిగా విభజించినచో (9×9=81) ఏకాశీతి పదవాస్తువు అగును. ఎనిమిది ఎనిమిదిగా విభజించినచో (8×8=64) చతుష్షష్టి పదవాస్తువు అగును. ఆరు ఆరుగా విభజించినచో (6×6=36) షట్త్రింశ పదవాస్తువు అగును. ఈ వాస్తుపద విభజనలు అన్నియును ఈ గ్రంథము యొక్క రెండవ భాగములో వివరింపబడినాయి అందుచూడదగును. పాఠకుల సౌకర్యార్థము నాలగు మాత్రము ఆవశ్యకతను బట్టి మరల పరిచయం చేయబడినాయి.

**ప్రస్తుతాంశము:** తొమ్మిది తొమ్మిదిగా విభజించిన అనగా 81 భాగముల గల ఏకాశీతి పదవాస్తువు గల గృహనిర్మాణ స్థలమునకు చుట్టును ఒక భాగము పిశాచ భాగము అగును.

ఉదా: ఒక వ్యక్తి 31 గజముల పొడవును 29 గజముల వెడల్పును కొలతలు (లో-కొలతలు) గల్గునట్లుగా గృహమును నిర్మింపదలచినాడు, పశ్చిమమునను దక్షిణమునను అతడు పిశాచ భాగంగా ఎంతవదలవలయును అని ప్రశ్న.

**సమాధానము:** చుట్టూ మూడున్నర గజముల స్థలాన్ని వదలినచో సరిపోవును.

ఇది స్థూలంగా (81) ఏకాశీతి పదమును అనుసరించి తెల్పబడినది. శతపదవాస్తువునకు అయినచో - ఇంకకొంత తక్కువ రాగలదు.

**(64 పదముల)** షట్త్రింశ వాస్తువునకును ఇది సరిపోవును. అంగుళము లేక రెండు అంగుళములు హెచ్చు తగ్గులైనను దోషము లేదు. దానిని ఖాళీగా వదలక అందులో స్నానాది గృహాలు కట్టుచున్నారు గనుక కొంత ఎక్కువగా పిశాచ భాగాన్ని ఉంచినను దోషం లేదు, ముఖ్యంగా తూర్పు ఉత్తరములందు మాత్రం - దక్షిణ పడమరల కంటె ఎక్కువ స్థలాన్ని ఉంచవలయును.

కృష్ణవాస్తుకారుడు ఆరవ భాగాన్ని పిశాచ భాగంగా పేర్కొన్నాడు. ఉత్తరోత్తరా గృహాన్ని పెంచదలచినచో నాల్గువైపులను పెంచడానికి ఈ వదలబడిన స్థలము కొంత ఉపయోగపడును అని - కృష్ణవాస్తు కారుని భావంగా తోచును.

గృహనిర్మాణ విషయంలో నీటివిషయాన్ని ముఖ్యంగా ఆలోచింపవలయును. శుభజలము సమృద్ధిగా లభించే స్థలములందే గృహవసతిని కల్పించుకొనదగును. అందుచే మొదట బావిని గాని బోర్‌వెల్ గాని వేయించి గృహారంభం చేయడం మంచిది. దీనివలన గృహనిర్మాణానికి నీటిని వేతేచోటునుండి తెప్పించే శ్రమయును తప్పిపోవును. బావులు ఏ ప్రక్కన ఉండవలసినది ప్రత్యేక శీర్షిక క్రింద వివరిస్తాను. ప్రస్తుతం గృహారంభానికి ముందు బావి అవసరం అని గ్రహింతురుగాక.

### 3. శంకుస్థాపనము

వృషభచక్రశుద్ధమైన శుభముహూర్తమున శంకుస్థాపన చేయవలయును. వృషభ-కలశచక్రముల లక్షణములు. ఈ గ్రంథము రెండవ భాగంలో గలవు. శంకుకర్రను మేడి, మద్ది, శ్రీచందనము, టేకు - మారేడు వెదురు మొదలైన శుభవృక్షముల కర్రతో తయారు చేస్తారు. ఇది అడుగుకు తగ్గకుండా రెండు అడుగులకు మించకుండా ఉండడం మంచిది, పుచ్చిపోయింది ముడులు తిరిగింది కాలినది అయిన కర్రను శంకువునకు ఉపయోగింపరాదు. మధ్యభాగాన గాని లేక పై భాగాన చుట్టు కొలత ఆరంగుళాలకు కొంచెం హెచ్చుతగ్గులుగా ఉండదగును. పచ్చికర్రయును పనికి వచ్చును. కర్రను గుండ్రగా చెక్కవలయును.

క్రింది భాగాన కొనదేలి ఎన్మిది పక్షాలుగా ఉండవలయును. కర్రయొక్క పై భాగంపైకి - క్రింది భాగం క్రిందికి ఉండవలయును. దీనిని వాస్తు సిద్ధముహూర్తమున గంధపుష్పాదులతో పూజించి నవధాన్యాది సహితంగా వాస్తుపురుషుని నాభియందు స్థాపిస్తారు. నైవేద్యాదికమును అర్పిస్తారు. ఈ నైవేద్యాదికమును నాల్గుదిక్కులయందుండే శర్యస్కందాది దేవతలకు చరకే విదార్యాది కోణదేవతలకు అర్పిస్తారు.

పిమ్మట ఈశాన్యం నుండి గృహకార్యాన్ని ఆరంభిస్తారు.

గోడలు గాక పిల్లర్సు అనగా సిమెంట్ స్తంభాలు ఏర్పాటు చేసేవారు, ఆ పనులను ఆరంభిస్తారు. ముందుగానే గుంతలు త్రవ్వినవారు మొదట ఈశాన్యం నుండి ఆగ్నేయం వరకు ఉండే పిల్లర్సు పనులను చేయవలయును గోడలు కట్టేవారు, ఈశాన్యం నుండి ఆగ్నేయం వరకు గోడను కట్టుటను ఆరంభింపవలయును, అటు పిమ్మట ఈశాన్యం నుండి వాయవ్యం వరకు పిల్లర్ల పనినిగాని గోడపనిని గాని చేపట్టవలయును.

అటుపిమ్మట నైరుతి కోణమునందు ఆరంభించి - ఆగ్నేయం కోణంవరకు పనులు చేయవలయును. పిమ్మట నైరుతి నుండి వాయవ్యం వరకు పనులు చేయవలయును. అన్ని పిల్లర్లు ఒక్కసారిగనే ఆరంభింపదలచిన వారు,

ఒకసారియైనను ఈ క్రమంగా ఆరంభించడం శుభం అని తెలుసుకొనవలయును ఇందు హేతువాదం పనికిరాదు. ఇవి మహర్షుల అనుభవవాక్కులు అని గ్రహింపవలయును.

**4. శంకుపద నిర్వచనము**

వ్యాకరణ శాస్త్ర ప్రకారము శంకు పదానికి నిర్వచనాలు ఎన్నియోగలవు కాని ఈ క్రింది నిర్వచనాలు రెండును అర్ధవంతంగాను, సముచితంగాను ఉన్నాయి.

1. శక్నోతి శుభకరణే సమర్థోభవతి ఇతి శంకుః

శక్నశక్తా ఉప్రత్యయము కర్త్రర్థమున శుభాగమము అనగా శుభమును గల్గించుట యందు శక్తి గలది అని భావము.

2. శంశుభం కౌతి శబ్దయతి ఆమంత్రయతి ఇతి శంకుః

**భావము:** శం అనగా శుభము, దానిని అనగా శుభమును శబ్దించునది ఆహ్వానించునది గనుక ఇది శంకువు అయినది.

ఈ శంకువు వల్ల సమస్త అరిష్టాలు తొలగి గృహస్థుడు సర్వశుభాలు పొందును అని సారాంశము, తక్కిన వాస్తుపూజా విధానాదికము అంతయును ముహూర్తభాగసంబంధమైనది దానిని యోగ్యుడైన పురోహితునిచే నిర్వహింపగలరు.

కొందరు శంకుకర్రను ఈశాన్యమున స్థాపించవలయును అందురు. అది సరిగాదు. ఆంధ్రదేశమందు అధికంగా ప్రసిద్ధమైన కృష్ణ వాస్తుకారుని ఈ పద్యమును చదువండి. విషయమును స్ఫుటముగా అవగతము చేసుకొనండి.

పేర్మితో వాస్తుపురుషు నాభిస్థలమున

**హస్తమాత్రప్రమాణ గర్తాంతరమున**
**రత్నధాన్యంబులుంచి ప్రయత్నముగను**
**శంకుస్థాపనముంచేయ, సఫలమభవ**

**భావము:** స్థిరవాస్తుపురుషుడు ఈశాన్య శిరస్కుడై బోర్లపడియుండును అని పూర్వము తెలుపబడినది. నడుమ బ్రహ్మస్థానము అగును. అచ్చటనే సుమారు రెండు మూరలు (ఒక గజము) గుంతను త్రవ్వి - నవధాన్యాదులు, శక్తికొలది రత్నాదికము ఉంచి శంకుకర్రను స్థాపింపవలయును.

**5. గోడలు సమానంగా ఉండవలయును**

గృహానికి నలువైపుల ఉండే గోడలు సమానంగానే ఉండవలయును గాని హెచ్చుతగ్గులుగా ఉండరాదు. సమానత వీడినచో గల్గే దోషములు బహుళములుగా ఉండును. కాని ఈ ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు ఈ విషయములో విరుద్ధముగా రచనలు చేసినారు.

**ఆదౌ పూర్వోత్తరా పంక్తిః పశ్చాద్దక్షిణపశ్చిమే।**
**వాస్త్వన్తరేభిత్తిసమం శుభదం తత్ప్రకీర్తితమ్॥**

(సమరాంగణ సూత్రధారము - భోజరాజు)

**విషమే దోషబహుళం ఋజువేధం ప్రజాయతే!**
**ఋజువేధేమహాత్రాసో జాయతే నాత్రసంశయః**

**భావము:** మొదట పూర్వోత్తరమున అనగా ఈశాన్యమున గోడను ఆరంభింపవలయును. పూర్వపదప్రాధాన్యాన్ని బట్టి తూర్పు నుండి ఆగ్నేయకోణము వరకు మొదట గోడకట్టవలయును. అటుపిమ్మట ఈశాన్యకోణం నుండి వాయవ్యకోణం వరకు ఉత్తరపు గోడకట్టవలయును పిమ్మట దక్షిణ పశ్చిమ కోణమున అనగా నైరుతి కోణమున ఆరంభించి దక్షిణ గోడను ఆగ్నేయము వరకు కట్టి తూర్పు గోడతో సంధింపవలయును. నైరుతి నుండి పడమటి గోడను కట్టుటకు ఆరంభించి వాయవ్యమున ఉత్తరపుగోడతో సంధింపవలయును.

"భిత్తిసమంశుభదం" అనుటచే నాల్గుగోడలును సమానమైన ఎత్తు గల్గి ఉండవలయును. అటులుండినచే శుభములు గల్గును. నలువైపులను గోడలు సమానముగా ఉండక హెచ్చుతగ్గులుగా ఉన్నచో ఋజువేధాదోషము గల్గును. ఈ ఋజువేధా దోషము అనేది బహువిధదోషాలకు నిలయము నిత్యము భయంగా జీవితం గడుపవలసి వచ్చును.

**వివరణ:** అతిముఖ్య విషయములందే శాస్త్రకారులు అన్వయముఖంగానూ వ్యతిరేక ముఖంగాను బోధిస్తారు. ఉదా: సత్యంవద = సత్యము పలుకుము (అన్వయపద్ధతి) నానృతం బ్రూయాత్ = అసత్యము పలుకవద్దు (వ్యతిరేక పద్ధతి)

**ప్రస్తుతాంశము (శ్లోకముతో)**

బిత్తి సమంశుభదమ్ = గోడల సమానత శుభదాయకము (అన్వయపద్ధతి)

**విషమే దోషబహుళం ఋజువేధం ప్రజాయతే ।**
**ఋజువేధే మహాన్ త్రాసఃజాయతే, నాత్రసంశయః ॥**

**భావము:** గోడలు విషమములై ఉన్నచో బహుదోషరూపమైన ఋజువేధా దోషము గల్గుతుంది. మిక్కిలి భయము జనిస్తుంది. ఇందు సందియము లేదు (వ్యతిరేక పద్ధతి)

నేడు నిర్మాణాలలో గొడలకంటె ముందుగా పిల్లర్సు అనగా సిమెంటు నిర్మిస్తున్నారు. ప్రాచీన కాలంలోను కొన్ని భవనాలకు రాతిస్తంభాలు వాడడం లేక చదునైన బండలను స్తంభాలుగా పేర్చడం ఉండేది. పై కప్పు తర్వాత గోడలు కట్టడం అనేది ఇప్పుడును, అప్పుడు సమానమే.

ఈ పిల్లర్లు సైతం ఈశాన్యం నుండి ఆరంభించడం శుభం. గృహాలకు ఆయాది విషయంలో లోకాలతలను శాస్త్రకారులు నిర్దేశించారు. ఈశాన్యంలో వెలిప్రక్కన పిల్లర్సుగాని గోడగానీ ఉండును గనుక వాస్తుపురుషుని శిరస్సు వేధింపబడడం అనేది లేదు.

పిల్లర్సు తర్వాత వచ్చే గోడలు గానీ వాస్తుపురుషుని అవయువాలకు వేధలను గల్గించవు. చుట్టూ గోడలు సరిగా ఉన్నచో తక్కిన గోడలను ద్వారాలను వేధా దోషం లేని రీతిగా ఏర్పాటు చేసి కొనదగును.

తూర్పునకు ఉత్తరమునకు మాత్రమే ఇంటిపైకప్పు నుండి నీరు అనగా వాన నీరు మొదలైనది ప్రవహింపవలయుననెడి నియమము ఏమియునులేదు. ఇల్లు విశాలమైనచో నాల్గుదిక్కులను, కాంపౌండు ఉన్నచో నాల్గు దిక్కులకును నీరుపోయే తూములు ఉంచుకొనవచ్చును.

తూర్పు నుండి ఈశాన్యం కోణం నుండి ఉత్తరం నుండి, వసతి కుదరనిచో ఆగ్నేయకోణం నుండి నీరు వెలికి

సోవలయును అనే నియమము ఇంటిపైకప్పు నీటికి లేదు. క్రింద అనగా గృహావరణములో భూమిపై నీటి విషయంలో - పై నియమాలు గలవు. ప్రాచీన పత్రాలను పరిశీలించండి. రాజభవనాలను గమనించండి. దేవుడి గర్భగుడిని పరిశీలించండి. నాల్గు దిక్కులను గోడలు సమానంగా అనగా ఒకే ఎత్తు గల్గివుంటాయి తిరుమలలోని కల్యాణమండపాన్ని ఆంధ్రదేశంలోని వారే గాక యావద్భారతంలో భక్తులు యాత్రికులు చాలావరకు సందర్శించియే ఉంటారు. దేవాలయాల ముందు ఉండే మండపాలను ప్రాచీనమైన వాటిని పరిశీలించండి నలుదెసలను స్తంభాలుగాని గోడలుగానీ సమానమైన ఎత్తులో ఉంటాయి. సువిశాలమైన నిర్మాణాలలో పైకప్పు నీరు నలు దిక్కులనూ క్రింద పడుతూనే వుంటుంది. అట్టియెడ నిరాధారంగా ఇటువంటి వాక్కులను వాస్తు సూక్తులుగా ప్రచారం చేయడంలోని ఆంతర్యము ఈ రచయితలకే తెలియాలి.

**6. గోడల లోపాలు - వాటి దుష్ఫలితాలు**

ముందుగా పిల్లర్సునేయబడి ఉన్నచో అవి సరిగాలేనిచో ఈ క్రింది విధముగా సవరింపవలయును.

అ. ఉత్తరపుఇంటితో సమానముగా గాని అంతకంటె ఒకటి రెండు అంగుళములు తన యింటికి పైకప్పు ఉండునట్లుగా
చూడవలయును గోడలే అయినచో ఉత్తరయింటికంటె తగ్గులేనట్లుగా గోడ పెట్టవలయును.

ఆ. పై విధముగానే తన యింటికి తూర్పున ఉండే ఇంటికంటె తగ్గకానట్లుగా గోడను పెట్టవలయును లేక పిల్లర్సు నిర్మింపవలయును.

ఇ. దక్షిణ దిక్కు ఇంటి కంటెను పశ్చిమ దిక్కు ఇంటి కంటెను తనయింటిని ఎత్తుచేయరాదు.

**గమనిక:** తన యింటికి పైన మేడను కట్టుచున్నచో పడమటి ఇల్లుగాని, ఉత్తరపు ఇల్లు ఒక అంతస్తు గలది అయినచో పై నియమము వర్తింపదు.

**1. గోడ** - పదనిర్వచనము.

కుడ్య అనే సంస్కృతపదమునకు గోడ పదము వికృతి పదము అందురు.

**"భిత్తి:** స్త్రీకుడ్యమస్త్రియామ్" అనే అమరకోశమును బట్టి భిత్తి కుడ్య శబ్దాలు. పర్యాయపదాలు అనియు, భిత్తి శబ్దము స్త్రీలింగము అనియు కుడ్యశబ్దము స్త్రీలింగము గాదు అనుటచే పులింగ నపుంసక లింగాలు రెండును గలది అనియు తెలియుచున్నది ఈ శబ్దాలను వైయాకరణులు ఇలా నిర్వచిస్తారు.

**భిత్తి:** భిద్యతేవిదార్యతే అనయాభూమిః శాలాదిరూపేణ ఇతి భిత్తి = భూమి, దీనిచే గృహము గదులు మున్నగు రూపములతో విభజింపబడును గనుక దీనికి భిత్తి అని పేరు గల్గినది.

**కుడ్య:** (కుడ్యమ్)= కుడతిదౌతి పతనసమయే ఇతి కుడ్యమ్ (కుడ్యః) పడిపోయే సమయంలో శబ్దించునది గనుక కుడ్యము అని యైనది. కాని పడేటప్పుడు అదియే గాక గృహవాసులను సైతం బిగ్గరగా ఏడ్పించేది అని నిర్వచిస్తే ఇంకా బాగుండేది అనిపిస్తుంది.

**ప్రస్తుతాంశము:** కుడ్యపదవికృతి యైన గోడ పదానికి కుడ్య నిర్వచనము అన్వయిస్తుంది.

**భోజరాజు:** సమరాంగణసూత్రధారములో గోడవిషయంగా అనుసరింపదగిన ఇరువది నియమాలను

బోధించాడు.వాటిని అనుసరింపనిచో ఇరువది నియమాలు ఇరువది దోషాలే అగును. దోష ఫలితాలు అన్నియును గృహవాసులను ఏడ్పించేవిగానే ఉన్నవి గనుక. కుడ్యపదానికి నేను తెల్పిన రెండవ నిర్వచనమే అనగా పతన సమయంలో గృహవాసులను బహువిధకష్టాలచే ఏడ్పించేది (కుడతిరావయతి. దోదయతి గృహస్థితాన్ నానా విధ దుఃఖ ప్రదానేనేతి కుడ్యమ్) అనేదియే బాగుగా అన్వయిస్తుంది. అందరును సంతోషించాలిసుఖించాలి అనే కోరుతారు గాని ఏడవాలి, కష్టపడాలి అని ఎవరును అభిలషింపరు గనుక గోడల విషయంలో జాగ్రత్త అనేది అవసరము.

ఈ ఇరువది నియమాలలో మొదటిది సువిభక్తము అనేది మాత్రము శాస్త్రీయమైనది తక్కినవి అన్నియును చాలా వరకు నిర్మాణసామాగ్రికి కొంతవరకు సావధానతకు సంబంధించినవియై యుండును అందుచే ముఖ్యంగా సువిభక్తము అనే నియమాన్ని శ్రద్ధగా గుర్తించడం అవసరము.

**సువిభక్తము:** వాస్తుపురుషాంగములు సువిభక్తములై అనగా చక్కగా విభజింపబడినవై అతడి అంగవేధా దోషములేనిది సువిభక్తము అనే గుణము గలది అగును.

"గోడలు- స్తంభాలు - ద్వారాలు వాస్తుపురుషాంగములందు ఉండరాదు" అని వెనుక ఈ గ్రంథము యొక్క ద్వితీయ భాగములో వివరింపబడింది. ఈ వాస్తుపురుషాంగవిభజన అనేది శాస్త్రీయమైనది. ఇక తక్కినవి యైన సమయము- చారువు- అనుద్వృత్తము మొదలైనవి తాపీ పనివారికి సంబంధించినవి.

**సమము:** గోడ, వంకరలు హెచ్చు తగ్గులు లేక సమానంగా ఉండడం.

**చారువు:** అందముగా చక్కనిపూతతో ఉండడము అనుద్వృత్తము. అక్కడక్కడ అనగా మధ్యమధ్యన గోడ ఉబ్బకుండా ఉండడము.

ఈ దోషములన్నియును సమముగా ఉండవలయును అనే ఒక్క లక్షణముచేతనే తొలగిపోవును. అందుచే తక్కిన గుణములు అన్నియును సమము అనే పదము యొక్క వివరణలే అగును.

మొదట ప్రముఖ దానిని బోధించడం పిమ్మట దానికి వ్యాఖ్యానాలుగా తక్కిన వాటిని పేర్కొనడం శాస్త్రకారుల పద్ధతి.

భగవద్గీతలో పదమూడవ అధ్యాయాన్ని క్షేత్ర, క్షేత్రజ్ఞ విభాగయోగము అందురు. అందు ఆత్మసాధన లేక జ్ఞానసాధన - గుణాలు 'అమానిత్వం అదంభిత్వం' ఇత్యాదిగా దాదాపు ఇరువది పేర్కొనబడినాయి. కాని ఇందులో మొదటిది అమానిత్వము అనేది. మానము అనగా శరీరాభిమానము నేను, ఈ శరీరము అనే భావము అది లేకపోవడం అమానిత్వము అగును. లోకంలో జరిగే అకార్యాలు అన్నీ ఈ శరీరము నేను అనే భావం వల్లనే సంభవిస్తూ ఉంటాయి. శరీరము అనేది భగవంతునిచే ధర్మ సాధనకై నాకు అనుగ్రహింపబడిన పరికరము. ఇది ధర్మసాధన ద్వారా అరిగిపోతే, తునిగిపోతే యజమానుడైన ఈశ్వరుడు నా నిజాయితీకి ఆనందించి ఇంతకంటే మంచి పరికరాన్ని అనగా శరీరాన్ని అనుగ్రహిస్తాడు. అనే అచంచలమైన అమానిత్వము ఉన్నవానికి అహింసా - నమ్రతా - అక్రోధాది సుగుణాలు స్వయంగా వచ్చి దాస్యము చేస్తాయి. అయినను భగవానుడు అహింసా సత్యాది గుణాలను పేర్కొన్నాడు. అంటే అమానిత్వము గల్గినచో అన్నియును అలవడును అనే వ్యాఖ్యానమే అగును.

**ప్రస్తుతాంశము:** గోడ, సువిభక్తముగాను, సమముగాను ఉండవలయును ఉన్నచో అన్ని దోషాలు తొలగును అని తెలియదగును.

**7. గోడలు ఉబ్బుట - పడుట వలన చెడు ఫలాలు:**

కృష్ణవాస్తు శాస్త్రకారుడు - గోడల విషయంలో మూడు దోషాలను మాత్రమే ముఖ్యంగా పేర్కొన్నాడు. సమారంగణ సూత్రధారాది గ్రంథాలలో బహువిధదోషాలు తెలుపబడినాయి.

కం. మేలిమిగ గోడఁ బెట్టగ
ప్రీలినఁదస్కరభయంబు - వెలివీగినచో
నాలము లోవీగిన ని
ల్లాలికి భయమగునటందు రార్యులు కృష్ణా॥

**భావము:** గోడ పెట్టుచుండగా విరిగి పడినచో దొంగలభయము గల్గును - వెలిప్రక్కగా విరిగి పడినచో కలహము గల్గును, లోప్రక్కగాపడిపోయినచో భార్యకు కీడు గల్గును.
(కృష్ణ వాస్తువు)

సమరాంగణ సూత్రధారములో - దిక్కులను బట్టియు, విదిక్కులను బట్టియు - ఇటుల చెడు ఫలితాలు తెల్పబడినాయి.

**దక్షిణంతు యదాకుడ్యం విచినోతి బహిర్ముఖమ్।**
**తదావ్యాధి భయంవింద్యాత్ మృత్యుదండంచ నిర్దిశేత్॥**

**భావము:** దక్షిణ దిక్కున ఉండే గోడ వెలిప్రక్కగా ఉబ్బినచో వ్యాధి బాధలును మృత్యుభయమును గృహవాసులకు గల్గును.

**పశ్చిమంతు యదాకుడ్యం విచినోతిబహిర్ముఖమ్।**
**ధనహానిం తదావిద్యాత్ దస్యుభ్యశ్చ భయం భవేత్॥**

**భావము:** పడమటి దిక్కున గోడ వెలిప్రక్కగా ఉబ్బినచో ధన హానియు దొంగల భయమును గల్గును.

**ఉత్తరంతుయదాకుడ్యం విచినోతీ బహిర్ముఖమ్।**
**కర్తారంస్వామినంవాపి వ్యసనం ప్రాపయేత్తదా॥**

**భావము:** ఉత్తరపు గోడవెలిముఖంగా ఉబ్బరాదు, వంగరాదు అటులున్నచో గృహస్వామిని, అలాగే గోడపెట్టే వానిని వ్యసనలంపటుని చేయును.

**ప్రాచ్యాం బహిర్ముఖం కుడ్యంచినోతి స్థపతిం తథా।**
**రాజదండభయం తత్రనిర్దేష్టవ్య విచక్షణైః॥**

**భావము:** తూర్పు గోడ వెలిముఖంగా వంగినను ఉబ్బిననూ కట్టిన శిల్పికిని గృహస్వామికిని రాజదండన భయం గల్గును

**"ఏతదేవఫలం విద్యాత్ పతితే దలితే తథా॥"**

**భావము:** గోడలు పడిపోయినను బీటలు (పగుళ్లు) వాటినను ఆయా దిక్కులను బట్టి ఇదే ఫలములను తెలియువలయును.

**విశేషము:** లోపలి ముఖంగా పడినను ఉబ్బినను బీటలు పారినను ఫలితములు చెప్పలేదు! ఈ విషయంలో ఇల్లాలికి ప్రాణభయము అని కృష్ణవాస్తు శాస్త్రములో తెలుపబడినది అట్లు తెల్పుటకు ఆయనకు ఏదో ప్రామాణ్యం

లభించి ఉంటుంది.

**కర్ణముల విషయము**

యన్యప్రాగ్దక్షిణః కర్ణః ప్రచినోతి బహిర్ముఖః ।
స్యాత్తత్రాగ్నిభయం ఘోరం గృహభర్తుశ్చ సంశయం: ॥

**భావము:** ఆగ్నేయ కర్ణము రెండు విధాలు: అందు తూర్పున ఉండే ఆగ్నేయ కర్ణము వెలికి వంగడం లేక ఉబ్బడం గల్గి ఉన్నచో భయంకమైన అగ్నిభయం గల్గుతుంది. దక్షిణాగ్నేయ కర్ణము వెలిగి వంగినచో - యజమానునకు ప్రాణభయం గల్గుతుంది. కర్ణము = కోణ భాగము.

గచ్ఛేద్బహిర్ముఖః కర్ణోయదాదక్షిణ పశ్చిమః ।
కలహోపద్రవస్తత్ర స్యాద్భార్యాయాశ్చ సంశయం: ॥

**భావము:** దక్షిణ నైరుతి కర్ణము వెలికి వంగి ఉన్నచో భార్యవలన కలహబాధ గల్గుతుంది. పశ్చిమ నైరుతి కర్ణము వెలికి వంగి యున్నచో భార్యకే సంశయం గల్గుతుంది. అనగా జారిణియై ఎవనివెంటనో వెళ్ళడంగాని మరణించడం గాని సంభవిస్తుంది - గృహంలో భార్య ఉనికియే సంశయం అని సారాంశము.

పశ్చిమోత్తర కర్ణేతు సంప్రయాతే బహిర్ముఖే ।
పశువువాహనపుత్రాణాం సంశయస్తత్రజాయతే॥

**భావము:** వాయవ్య కర్ణము వెలి ముఖముగా ఉన్నచో పశువాహనపుత్రులకు కీడు గల్గుతుంది.

**వివరణ:** ఇచ్చట పశ్చిమవాయుకర్ణమునకును ఉత్తరవాయు కర్ణమునకు ఒకే చెడుఫలము తెల్పబడినది.

ప్రాగుత్తరోయదాకర్ణః ప్రచీయేతబహిర్ముఖః।
గురూణాం సంశయస్తత్ర గోవృషాదేశ్చజాయతే ॥

**భావము:** తూర్పు ఈశాన్య కర్ణము వెలికి వంగినచో గురుజనుల జీవితము అనగా తల్లి తండ్రి మొదలైన వారి జీవితము. సంశయగ్రస్తము అగుతుంది. ఉత్తర ఈశాన్య కర్ణము వెలి ముఖంగా వంగినచో ఆవులు, ఎద్దులు మొదలైన పశుసంపదకు హాని గల్గును.

**విశేషము:** మరికొందరు పండితులు - ఈ శ్లోకానికి భావము ఇట్లు వివరిస్తారు.

1. ఈశాన్యకర్ణము - ఏది బహిర్ముఖంగా ఉన్నను గోవులు వృషభములు మొదలైన జంతువుల వలన తల్లి తండ్రి వంటి గురుజనుల జీవితము అపాయములో చిక్కుకొనును (గోవృషాదేః= గోవృషాదికం వలన)
2. కర్ణములయొక్క లో భాగం ఉబ్బడాన్ని గురించి తెల్పలేదు అటులనే బీటలువారుటకును పడిపోవుటకును ఫలము తెల్పలేదు.

   వీటికి అన్నిటికిని లో ప్రక్కన అయినచో ఇదే చెడు ఫలితాలను కొంత అధికంగా త్వరలో సంభవం అగునట్లు తెలియదగును.

## 8. గోడల వేధాదోషాలు

వెనుక ద్వార విషయకవేధాదోషాలలో గోడల వలన ద్వారాలకు సంభవించే దోషాలు మాత్రం తెల్పబడినాయి. ప్రస్తుతం గోడల వలన గోడలకు వేధాదోషాలు తెల్పబడుచున్నాయి. ఈ వేధాదోషాలను గోడపోటులు అనియు అందురు.

ఇవి స్వగృహసంబంధమైనవి గాను రెండు గృహాలు విడివిడిగా లేనిచో - పరగృహ సంబంధమైనవిగాను ఉండును. శాస్త్రజ్ఞులతో సంప్రదించి జాగ్రత్తగా గృహనిర్మాణము చేసికొనడం శుభకరము. కొన్ని గోడపోటులన అనగా భిత్తివేధాదోషాలను పరిచయం చేయుచున్నాను.

ఉదా: 1. ఒకే గోడయైనను స్థలంలోని హెచ్చు తగ్గులవలన వరుస తప్పడము.

**వివరణ:** ఇది నిర్మితమైన గృహము - చుట్టు గృహాలు గలవు. ఇందు గోడ పోటులే గాక ఇతర దోషాలును గలవు. ఈశాన్యం తగ్గింది, వాయవ్యం, ఆగ్నేయం పెరిగింది. దిఙ్మోఢదోషం అధికంగా ఉంది.

**సవరించే విధానము**

1. ఉత్తర గృహము వారికి ఆగ్నేయం పెరిగింది. అది వారికి శుభంగాదు. వారి ఆగ్నేయము తనకు ఈశాన్యముగును గనుక ఉత్తర గృహము వారికి నచ్చచెప్పి తనకు అవసరమైనంత వరకు వారి ఆగ్నేయాన్ని ఖరీదు చేసి, తన ఈశాన్యలోపాన్ని సవరించుకొనడం.

2. నైరుతి పెరుగుదలను రెండు విధాలుగా సవరింపవచ్చును.

**ఒక పద్ధతి:** నైరుతి పెరుగుదలను దక్షిణమువారికి అమ్మడం

**రెండవపద్ధతి:** గోడపోటు ఉన్న స్థలమునందు గోడపోటు పూర్తిగా తొలగునంత అలమారాను గోడలో ఏర్పాటు చేసికొనడము.

దీని వలన గోడపోటు తొలగిపోవును. రెండు మూలలకొలతలు రెండు పాడవుల కొలతలు రెండు వెడల్పుల కొలతలు సరిపడును.



2. తన ఇంటిలోనే రెండు అడ్డగోడల మూలలు తగులడం




**వివరణ:** గృహనిర్మాణము చాలా వరకు సరిగానే ఉన్నది. కానీ గోడ పోట్లు అధికంగా వున్నాయి. గోడపోట్లను సరిచేసికొన్నచో శుభప్రదమైవుండగలదు.

3. ప్రక్కయింటి గోడలు పోటుతగులడం

**గమనిక:** ప్రత్యేక గృహాలకు అనగా చుట్టూ కాంపౌండు ఉండే గృహాలకు ఈ దోషం వర్తింపదు.

**ఉదా:**



**వివరణ:** ఈ స్థలాన్ని అన్నదమ్ములైన ఇరువురు కొన్నారు. రాజమార్గం ఉత్తరంగా ఉడడంవల్ల ఉత్తరముఖంగా ఉండే విధంగా స్థలాన్ని పంచుకొన్నారు. శాస్త్రప్రకారం అన్నకు పశ్చిమభాగం, తమ్మునికి తూర్పు భాగం వచ్చింది.

విడిగా గృహాలు కట్టుకొని ఉన్నచో శుభంగా ఉండేది. మధ్యగోడ కలిసి వస్తుందనే భావంతో కలిపికట్టుకొన్నారు. ఇందువలన అన్నకు తూర్పున ఖాళీస్థలం లేకుండాపోయింది. ఇది ఒక దోషము.

**రెండవ దోషం:** దక్షిణము గదులకు గొడ పోటు సైతము వచ్చింది.

**సవరించే విధానము:**

**ఒకటి–** ఇంటిని ఒకరే తీసికొని గోడపోటును సవరించుకొనడం.

**రెండవ పద్ధతి–** ఇద్దరు ఇంటిని గూర్చి పట్టుదలగా ఉన్నచో గోడపోటును సవరించుకొని ఇంటిపైన ఇంకొక ఇల్లును కట్టి పైన పెద్దవాడును - క్రింద చిన్నవాడును ఉండడము.

**గమనిక:** ఈ విధమైన దోషాలు ఒకే గోడతో ఉన్నచో ప్రక్కగృహాల వలెనే, వెనుకటి గృహాలవలనను సంభవిస్తాయి.

గోడపోటులవలెనో దూలముల పోటులను ఉండరాదు.

కొన్ని పోటులను తెల్పినాను. తక్కిన వాటిని ఊహింపగలరు. ఈ విషయాలలో వాస్తు శాస్త్రజ్ఞులను సంప్రదింతురు గాక!

## 17. అటకలు

అటుకలు - అలమారాలు కిటికీలు మొదలైనవి గోడలకు సంబంధించినవి.

గోడలు స్తంభాలు మొదలైన వాస్తు ద్రవ్యములు అన్నియును వాస్తు వేధనుపొందని విధంగా ఉండవలయును అని ఈ గ్రంథము యొక్క ద్వితీయ భాగంలో వివరింపబడింది.

పాఠకుల సౌలభ్యము కొరకై అందలి ముఖ్యాంశములు కొన్నిటిని పరిచయం చేస్తున్నాను.

వాస్తుపురుషుడు ఈశాన్యమున శిరముంచి అందుకు తగినట్లు నైరుతి పాదములుంచి బోర్లపరుండును అనే విషయాన్ని పాఠకులు జ్ఞాపకము చేసికొనదగును. ఈ శిరఃపాదములను బట్టి తక్కిన అంగాల విభజన జరిగింది. అతడి (వాస్తు పురుషుడి) అంగవేధగల్గని విధంగా గోడలు వాటికి అటుకలు ఉండడంలో దోషంలేదు. కాని నేటి ఆధునిక వాస్తుశాస్త్ర రచయితలు తమ గ్రంథాలలో తూర్పునందు ఉత్తరము నందు బరువు ఉండరాదు అనియు అటుల ఉన్నచో అనేక అరిష్టాలు గల్గును. పశ్చిమ దక్షిణాలయందు అందును పశ్చిమ దక్షిణ కోణమైన నైరుతి యందు బరువు ఎంత ఎక్కువగా ఉంటే అంత శుభం అధికం అనియు అనుప్రాస వాక్య చమత్కారాలతో అభివర్ణించారు. గోడలకంటె అటుకలు భారంగా ఉండవు గోడలు వాస్తు శుద్ధములు అయినప్పుడు అటుకలు దోష యుతములు అనడంలో అర్థంలేదు.

**వాస్తవిక పరిస్థితి**

ద్వారముపైన అటుకలు మున్నగునవి ఏవియును ఉంచరాదు అని వెనుక తెలుపబడింది అందుచే ద్వార భాగాలను మాత్రం వీడి అనుకూలతను బట్టి అన్ని దిక్కుల గోడలకును అటుకలను ఉంచవచ్చును.

గోడవలెనే అటుకలును నిరపాయకరంగా ఉండవలయును. తలకు దగులని ఎత్తులో ఉండడం మంచిది. అలమారాలపైనను అటుకలు ఉంచవచ్చును.

వంటయింటిలో శయనింపరు గనుక దేవతా స్థలమును వదలి వీలైనన్ని అటుకలు వసతిని వైశాల్యాన్ని బట్టి ఉంచడంలో దోషం లేదు క్రిందుగా అటుకలను ఉంచదలచిన గోడకు మూడు లేక మూడున్నర అడుగుల ఎత్తున ఉంచదగును. అవి తలలకు తగులవు. ప్రత్యేక గృహాలు అయినచో వెలిగోడలకు అటుకలు గాని గూళ్ళు గాని ఉంచడం అంత శుభంగా ఉండవు. దొంగలు అటకల క్రిందగాని గూళ్లకుగాని కన్నము తేలికగా వేయగలరు.

రాశి గోడలు అయినచో వెలి గోడలకును అటుకలను గూళ్లను ఉంచవచ్చును.

వాస్తు పురుషాంగ వేధ గలిగినచో - గోడలుగాని స్తంభాలుగాని గృహద్రవ్యాలు ఏవియు శిరమునందే గాదు నీరు బోధించే నైరుతియందును ఉంచరాదు. శిల్పరత్నము 18 అధ్యాయములోని ఈ క్రిందికారికలను చదవండి.

మూర్ధ్నివక్త్రేథకంఠేచహృదయేమరణంభవేత్
విద్ధేచోరసిహృద్రోగః పాదయోఃకలహోభవేత్॥
(ఇత్యాదికము)

**భావము:** వాస్తుపురుషుని శిరముగాని కంఠముగాని హృదయముగాని - గోడలు స్తంభాలు ద్వారాలు మొదలైన వాటిచే వేధింపబడినచో యజమానాదులకు మరణము గల్గును. వక్షము వేధింపబడినచో గుండె జబ్బులు వచ్చును. నైరుతిని ఉండేపాదాలు వేధింపబడినచో కలహం జనిస్తుంది. ఇటులనే సర్వాంగాల విషయంలోను వేధాదోషాలచే జనించే దుష్ఫలితాలు బోధింపబడినాయి.

**సారాంశము:** గోడలు వాస్తువేధారహితములై అనగా నిర్దుష్టాలుగా ఉన్నచో అటుకలు ఏ దిక్కున ఉండినను దోషము గోడలకంటె అటుకలు భారములుగావు.

## 18. అలిందాలు (వసారాలు)

వసారాలు - వరండాలు - అలిందాలనేవి పర్యాయపదాలు ఇందులో అలిందము అనేది సంస్కృత పదము మొదటి రెండును తెలుగుపదాలు.

అల్యతే భూష్యతే గృహమనేన ఇతి అలిందః గృహము దీనినే అలంకరింపబడును - గనుక ఇది అలిందము అనబడును. నిఘంటుకారులు అలిందశబ్దాన్ని నిర్వచించారు. అల = భూషణ - పర్యాప్తి - వారణేషు అలంకారణ - పర్యాప్తము నివారణము - అనే అర్థాలను బోధించే అల - ధాతువు వలన అలింద శబ్దము జనించినదని వైయాకరణుల భావము వసారాలు వరండాలు అనే తెలుగు పదాలకు ఏదో నిర్వచనము సముచితమైనది ఉంటుంది. కాని నా ప్రతిభకు అందలేదు. విజ్ఞులు ఊహింపగలరు.

ముఖ్య గృహానికి అందముగా వంపుగా క్రిందికి ఉండే దీనిని చావడి అనియు కొందరు అందురు. కొందరు దీనిని పంచ అనియు అందురు మరికొందరు సోఫా అనియు అందురు. కొన్ని యిండ్లకు ఈ - పంచలు వరండాలు అనేవి ముఖ్యశాలలవలెనే పై కప్పుగలవై స్తంభాలతో శోభాయమానంగా ఉంటాయి. సింహద్వారానికి ఇరుప్రక్కలను ఈ పంచలలో అరుగులును ఉండును పంచల వైశాల్యాన్ని అనుసరించి అరుగులపై ఇరుప్రక్కలగాని, ఒక ప్రక్కన గాని చివరన గదులును ఉండును. కొందరు ఈ గదులలో ఏదో ఒక గదిలో మిద్దె పైకి సోపానాలు సైతం ఏర్పాటు చేసుకొందురు. పంచలో ఉండే అరుగులలో భూగృహాలవంటి పాతరలను సైతం కొందరు శ్రీమంతులు ఏర్పాటు చేసుకొందురు.

విశాల భవనాలలో కొందరు శ్రీమంతులు నడి గృహాలలో బ్రహ్మస్థానమునకు పైకప్పు వేయక ఖాళీ స్థలం ఉంచి - దాని చుట్టును స్తంభాలతో పైకప్పు వేసి గాని - లేక పెంకులు మొదలైన ఆచ్ఛాదనముల ద్వారా వాలువసారాలు

ఉంచడం కలదు - ఈ వసారాలు ఖాళీ స్థలానికి నలువైపులను ఉంటాయి. ఇట్టి గృహాలను చత్వరగృహాలు అంటారు. ఈ ఏర్పాటువలన ఇంటిలోనికి వెలుతురు పుష్కలంగా లభిస్తుంది. ఇచ్చట నడుమ ఉండే ఖాళీస్థలము - ఇంటి బేసి మట్టము కంటె సుమారు అడుగు లేక అడుగున్నర తగ్గుగాను, ఇంటివెలుపల భూభాగముకంటె దాదాపు అడుగులేక అడుగున్నర ఎత్తుగాను ఉండేవిధంగా గృహనిర్మాణం ఉంటుంది. ఖాళీ స్థలంలో పడే వర్షజలంగాని ఇతర జలంగాని వెలుపలికి పోవడానికి వీలుగా చత్వరంలో అనగా ఖాళీ స్థలంలో తూర్పున గానీ ఈశాన్యానగాని చిన్న సొరంగాన్ని ఏర్పాటు చేస్తారు. వెలుపలి నుండి విషజంతువులు సొరంగం ద్వారా ఇంటిలోనికి రాని విధంగా గల్ల ఇనుపచట్రాన్ని సొరంగానికి బిగిస్తారు. ఇనుప చట్రంవద్ద మురికి చేరి నీరు సరిగా వెలుపలికిపోనిచో అట్టి సందర్భాలలో తీయుటకు వీలైన విధంగా ఇనుపచట్రాన్ని సొరంగానికి బిగిస్తారు.

వసారాలను సంస్కృతంలో అలిందాలు, అలిందాలు అని అంటారు అని తెల్పినారు. అవి ఇంటికి అందాన్ని గల్గిస్తాయి అనియు నిర్వచనం చేశాము. ఈ నిర్వచనానికి తగినట్లుగానే కొందరు శ్రీమంతులు ఈ అలిందాలను అందంగా పలు రకాలైన చిత్రాలతోను వంపుసొంపులతోను - క్రొత్త పెండ్లి కూతురివలె శోభాయమానంగా ఏర్పాటు చేస్తారు.

ప్రాచీన నిర్మాణాలయందు అలిందాల క్రింద గృహంలోనికి వాస్తు సమ్మత స్థలమున ద్వారం గలదు. ముఖద్వారం ముందు ఉండే వసారాలను నాగేటివలె అనగా ఇరుప్రక్కల తగ్గుగాను ఎత్తుగాను ఏర్పాటు చేస్తారు. కొందరు అర్ధవర్తులంగాను కొందరు అండాకారంగాను తమతమరుచిని బట్టి ఏర్పాటు చేస్తారు. పైకప్పు గల్గి స్తంభాలు ఉన్నచో ఈ స్తంభాలు సైతం చిత్ర గరిమతో విరాజిల్లుతుంటాయి.

**సారాంశము:** వసారా - వరండా పంచ చావిడి, అలిందము, అలిందము, అనేవి పర్యాయపదాలు ఇవి ప్రధానగృహానికి చేర్చబడి ఉంటాయి. ప్రధాన గృహం కంటె కొన్ని యెడల తగ్గి వంపు గల్గి ఉంటాయి. కొన్ని యెడల అదే ఎత్తులో పై కప్పు గల్గి ఉంటాయి. కొన్ని యెడల ముఖద్వారానికి రెండు ప్రక్కలను ఈ పంచలలో ఎత్తైన అరుగులు ఉంటాయి. ఈ పంచలకు (వసారాలకు) అవసరం అయినచో స్తంభాలు ఉంటాయి. కాని గోడలు ఉండవు. ఇంటిలోపల ఉండే వసారాలను చత్వరాలు అంటారు. ఇంటిలోని వసారాలు నాల్గువైపులను ఉండును. వసారాల నడుమ ఖాళీ స్థలంపై కప్పు ఉండదు.

వసారాలను లేక అలిందాలను స్వయంవర కన్యనువలె శ్రీమంతులు యథాశక్తి అందంగా నిర్మించుకుంటారు.

**వసారాల - భేదాలు**

పలువిధాలుగా ఉండును. అని తెలిసికొన్నాము. ఛందఃశాస్త్రంలో గురులఘువుల ప్రస్తారంచే వివిధములైన ఛందస్సులు ఏర్పడుతాయి. అదేవిధంగా ఇచ్చటను కుడ్యాలిందముల యొక్క (గోడల, వసారాల యొక్క) ప్రస్తారంచే శాలాభేదాలు ఏర్పడతాయి.

**శాల:** నలుదిక్కులను గోడలు గల్గిన ప్రధానగృహమును శాల అందురు.

ఇచ్చట శాలా భేదముల విషయంలో గోడలకు గురువులనియు అలిందములకు లఘువులు అనియు వాస్తు శాస్త్ర సంకేతముగా తెలియుదగును.

ఛందఃశాస్త్రానికి - దీనికి ముఖ్యంగా రెండు విషయాలయందు భేదం గలదు.

**ఒక్కటి:** ఛందఃశాస్త్రంలో ప్రస్తారంచే జనించిన ఛందాలు అన్నియు స్వీకారాయిగానే ఉంటాయి ఇచ్చట కొన్ని శాలలు ప్రశస్తాలుగాను. కొన్ని అప్రశస్తాలుగానూ ఉంటాయి.

**రెండు:** ఛందఃశాస్త్రమునందు కొన్ని యెడల ఒక గురువునకు మారుగా రెండు లఘువులు వచ్చుటకు అవకాశం గలదు.

**ఉదా:** పరమసుగుణగేయ - వాయుతనయ

పరమ సుగుణవినయ, పవన తనయ

**వివరణ:** ఇచ్చట రేఖాంకిత పదములందు ఒక గురువునకు బదులుగా రెండు లఘువులు వచ్చినను ఛందో దోషము లేదు. వాస్తు శాస్త్రమునందు ఒక గోడకు బదులుగా రెండు వసారాలు వచ్చుటగాని అటులనే రెండు వసారాలకు బదులుగా ఒక గోడవచ్చుటగాని సంభవింపదు, సమరాంగణసూత్రధారమునందు ఏకశాలా లక్షణాధ్యాయములో గురులఘుప్రస్తార విధానము ఇటుల గలదు.

గృహాణా మేకశాలానాం వక్ష్యామోలక్షణాన్యథ।
శస్తానాం నిందితానాంచ యథావదను పైర్వశః॥
విన్యసేచ్చతురః పూర్వంగురూన్ వర్ణాన్ యథావిధి॥
ప్రసూయన్తే భేదాః షోడశవేశ్మనామ్॥
గరోరధోలఘుంన్య స్యేత్ పూర్వం శేషంయధోపరి।
గురుభిః పూరయేత్పశ్చాత్ యావత్ స్యుర్లఘవోఽఖిలాః॥
విద్యాదలిందాన్ సర్వేషులఘుస్థానేషు పండితః।
సవ్యావర్తగృహముఖాదేతాంశ్చవినివేశయేత్॥
ఏషామలిందసంయోగాత్ భవనానాం పృథక్ పృథక్।
నామాని గుణదోషాశ్చవక్ష్యన్తేను క్రమాదతః॥
ధ్రువం ధాన్యం జయంనందం ఖరంకాన్తం మనోరమమ్।
సముఖం దుర్ముఖం క్రూరం సుపక్షం ధనదంక్షయమ్॥
ఆక్రందం విపులంచైవ విజయం గృహముత్తమమ్।
అలింద ద్వారహీనంచ గృహంకోటీ సమంస్మృతమ్॥

ఇత్యాదికము

**భావము:** అలిందములతోడి గృహాల లక్షణములు తెలుపబడుచున్నాయి. వీటిలో ఏవిప్రశస్తములో ఏవి అప్రశస్తములో అదియును తెల్పబడుచున్నది.

గురు లఘు ప్రస్తారము ద్వారా పదునారు గృహాలు సంభవిస్తున్నాయి.

మొదట నాల్గు గురువులు ఉంచవలయును. గురువులు గోడలకును అలిందములకు లఘువులకును సంకేతములు అగును.

నాల్గుగురువులు అనుటచే ఇది నాల్గు దిక్కులను గోడలు మాత్రమే గలది అనగా వసారా లేనిది అని తెలియుదగును. దీనికి ద్వారం పై ప్రక్కన ఉండును. ధాన్యం కొట్టువంటిది అని సారాంశము.

UUUU - నాల్గు గురువులు అనగా నలువైపులను గోడలు గలది. ధాన్యం కొట్టువలెనుండునట్టిది. ఒక్కొక్క గురువు క్రింద లఘువు ఉంచివేసే ప్రస్తారాన్ని గమనింపుడు. ఇందలి నాల్గు గురువులు నాల్గు దిక్కుల ఉండే గోడలకు సంకేతాలు. అనగా మొదటి గురువు తూర్పునకును - రెండవ గురువు దక్షిణమునకును - నాల్గవ గురువు ఉత్తరమునకు బోధకములు అగును. ప్రస్తారక్రమంలో ఏ గురువు క్రింద లఘువు వచ్చునో ఆదిక్కున

ఉండే గోడకు వసారా ఉండును అని తెలియదగును. రెండు మూడు గురువుల క్రింద లఘువులు వచ్చినచో రెండు మూడు దిక్కుల గోడలకును వసారాలు ఉండును అని గ్రహింపదగును. నాలుగు గురువుల క్రిందను వసారాలు వచ్చినచో నలువైపులను గోడలకు వసారాలు ఉండును అని తలంపవలయును వసారాల క్రింద వాస్తు సమ్మతస్థలమున ద్వారాలు ఉండును అని పూర్వము తెలుపబడిన దానిని విస్మరింపరాదు. ప్రదక్షిణక్రమముగా గురులఘుప్రస్తారము చేయదగును.

పాఠకులు సులభంగా గ్రహించేందులకై - వీటి లక్షణములు నామములు ప్రశస్తములు ఏవో అప్రశస్తములు ఏవో కొంత వివరంగా ఈ క్రింద తెలుపబడుచున్నది. నాలుగు గురువుల ప్రస్తారంచే ఇవి పదునారుగా సంభవిస్తాయి.

1. **UUUU**-ధ్రువ శాల ఇది నలుదిక్కులను గోడలు గల్గి
ధాన్యం కొట్టు వలె ఉండును. పైభాగాన
ద్వారం ఉండును. మూషలు - అనగా కిటికీలు
ఉండవు ఇది నివాసయోగ్యంగాదు.

2. **IUUU**- ధాన్య శాల అని దీనిని అందురు.
తూర్పున ముఖద్వారం ఉండును - తూర్పుననే
వసారా ఉండును - తూర్పుముఖద్వారం గల్గిన
ఈ గృహాన్ని పశ్చిమశాల అందురు.
దక్షిణ - పశ్చిమ - ఉత్తరములందు గోడలు మాత్రమే
ఇది ధనధాన్యాభివృద్ధిని గల్గించును
దీనిని ధాన్యశాల అనియు కొందరు శాస్త్రజ్ఞులు అందురు

3. **UIUU**- జయ శాల - ఉత్తరశాల
దక్షిణమునందు వసారా మరియు ముఖద్వారము ఉండును
తక్కిన మూడు దిక్కులలోను గోడలు ఉండును. తనకు
విజయమును - ఫలితంగా శత్రువులకు పరాజయాన్ని గల్గిస్తుంది.

గమనిక : దక్షిణమున కప్పుతోడి పంచ ఉండవచ్చునుగాని
వంగిన వసారాను ఆధునిక వాస్తురచయితలు
అంగీకరింపరు - వారు ఆధారం తెల్పరు.

4. **IIUU**- నందశాల - పశ్చిమశాల
దీనికి తూర్పున ముఖద్వారమును - వసారా
ఉండును - దక్షిణమున - సాధారణ ద్వారమును
వసారా ఉండును. తక్కిన పడమటి దిక్కు
నందును, ఉత్తర దిక్కునందును, గోడలు ఉండును
ఉత్తరశాల - గాను దీనిని మార్చవచ్చును అని
కొందరు అందురు. అప్పుడు దక్షిణమున ఉండేది
ముఖద్వారంగాను, తూర్పున ఉండేది సాధారణ
ద్వారమును అగును.

**గమనిక:** ఆధునిక వాస్తు రచయితలు, ముఖ్య గృహంతో సమానమైన ఎత్తు గల్గిన లేక అంతకంటె ఎత్తు గల్గిన - పంచ వంటివసారాను - దక్షిణాన అంగీకరిస్తారు గాని. వాలువసారాను అంగీకరింపరు, ప్రాచీనులు సైతం ప్రస్తారవశంగా వచ్చిన గృహంగా పేర్కొన్నారే గాని దీన్ని శుభమైనదిగా తెల్పలేదు.

**5. UUIU-** ఖర శాల
ఇది పడమట సింహద్వారం మరియు
దానిని అనుసరించి వసారాయు ఉండును
తక్కిన తూర్పు - దక్షిణ - ఉత్తరములందు
గోడలు ఉండును - ఇది దుఃఖాన్ని గల్గిస్తుంది.

**ఫలము -** శ్రీ లాభము - ఆయురారోగ్యవృద్ధిని గల్గిస్తుంది. శుభమైనది

**6. IUIU-** ఇది కాంతశాల అనబడును.
తూర్పున సింహద్వారం ఉండడం వలన ఇది పశ్చిమ అగును.
పడమట సాధారణ ద్వారం ఉండును.
తూర్పు - పడమరలందు వసారాలు ఉండును.
మిగిలిన ఉత్తర దక్షిణ దిక్కులందు గోడలు ఉండును

**ఫలము -** శ్రీలాభము- ఆయురారోగ్యవృద్ధిని గల్గిస్తుంది. శుభమైనది

**7. UIIU-** మనోరమ శాల - దీనిని ఉత్తరశాల అందురు,
దక్షిణమున సింహద్వారం వసారా ఉండును.
పడమరయందు సాధారణద్వారమును, వసారాయు యుండును.
తూర్పు, ఉత్తరములందు గోడలు ఉండును.

**ఫలము -** ఇది మనస్సునకు సంతోషమును గల్గిస్తుంది అని ప్రాచీనులు అందురు.
ఆధునిక వాస్తు రచయితలు - దక్షిణ పశ్చిమ దిశలయందు వాలువసారాలను అంగీకరింపరు.

**8. IIIU-** సుముఖ శాల - పశ్చిమ గృహము
తూర్పున సింహద్వారం వసారా ఉండును
దక్షిణ పశ్చిమములందు సాధారణ ద్వారాలను
వసారాలు ఉండును - ఉత్తరాన గోడ ఉంటుంది.

**ఫలము:** ఇది రాజసన్మానాన్ని గల్గిస్తుంది.

**గమనిక:** ఆధునికులు దీని విషయంలో దక్షిణాన
వసారాను అంగీకరింపరు. పశ్చిమ వసారా, తూర్పు
వసారా కంటె ఎత్తుగా ఉండవలయును అందురు.

**9. UUUI-** దుర్ముఖ శాల
ఇది - దక్షిణ గృహమును - ఉత్తర
ముఖద్వారమును గలది అగును - ఉత్తరమునందు
వసారా ఉండును - తూర్పు - దక్షిణ - పశ్చిమ దిశలలో గోడలు ఉండును.

**ఫలము:** కలహామును గల్గిస్తుంది.

**గమనిక:** ఆధునికులు దీనిని ప్రశస్తంగా పేర్కొందురు.

**10. IUUI-** క్రూర శాల - పడమటిశాల
తూర్పున సింహద్వారం వసారా ఉండును - ఉత్తరమున
సాధారణ ద్వారం వసారా ఉండును - దక్షిణ పశ్చిమములందు
గోడలు ఉండును.

**ఫలము:** ఇది క్రూరవ్యాధులను గల్గిస్తుంది.

**గమనిక:** ఆధునిక వాస్తు శాస్త్రరచయితలు దీనిని శుభకరముగా పేర్కొందురు

**11. UIUI-** సుపక్ష శాల - దక్షిణశాల
ఉత్తరమున సింహద్వారము వసారా ఉండును
దక్షిణమున సాధారణ ద్వారము వసారా ఉండును
తూర్పు పడమరలయందు గోడలు ఉండును

**ఫలము:** ఇది వంశాభివృద్ధిని గల్గిస్తుంది

**గమనిక:** ఆధునికులు వాలువసారాలు అయినచో దక్షిణవసారా ఉత్తరవసారాకంటె కొంత ఎత్తుగా ఉండవలయును అందురు.

**12. IIUI-** ధన శాల - పశ్చిమశాల
తూర్పున సింహద్వారం ఉండడం వలన ఇది పశ్చిమశాల అగును.
దీనికి తూర్పున ముఖద్వారం - దక్షిణోత్తరములందు సాధారణ ద్వారాలు ఉండును.

**ఫలము:** స్వర్ణ రజతాది లాభమును, పశువృద్ధిని గల్గించును.

**గమనిక:** ఆధునికులు దక్షిణమునందు వాలువసారాను దోషము అందురు.

**13. UUII-** క్షయ శాల - తూర్పుశాల
పశ్చిమమున సింహద్వారం గలది అగుటచే ఇది తూర్పుశాల అగును పశ్చిమమున ముఖద్వారం ఉత్తరమున సాధారణ ద్వారం ఉండును. పశ్చిమాన ఉత్తరాన వసారాలు ఉండును. తూర్పు దక్షిణాలలో గోడలు ఉండును.

**ఫలము:** ఇది సర్వనాశనం చేయును

**14. IUII-** ఆక్రంద శాల పడమటిశాల
తూర్పు సింహద్వారం గలది అగుటచే ఇది పశ్చిమశాల అగును.
తూర్పున సింహద్వారమును. పశ్చిమోత్తరములందు ఉపద్వారాలు ఉండును.

తూర్పునందును పశ్చిమమునందును ఉత్తరమునందును వసారాలు ఉండును. దక్షిణంలో గోడ ఉండును.

**ఫలము:** ఇది బంధుజన మృతిని తరుచుగా దుఃఖాలను గల్గిస్తుంది.

**గమనిక:** ఆధునికులు పశ్చిమాన ఉండే వసారా, తూర్పు ఉత్తర వసారాలకంటె కొంత ఎత్తుగా ఉన్నచో ఇది శుభకరమే అందురు.

**15. UIII-** విపుల శాల - దక్షిణశాల
ఉత్తరాన సింహద్వారం ఉన్నది అగుటచే ఇది దక్షిణశాల అగును.
దక్షిణమందును పశ్చిమమునందును ఉపద్వారాలు ఉంటాయి.
దక్షిణ - పశ్చిమ - ఉత్తరములందు వసారాలు ఉండును, తూర్పున గోడ ఉండును.

**ఫలము:** మంచి ఆరోగ్యాన్ని సుఖాన్ని ఇస్తుంది.

**గమనిక:** ఆధునికులకు ఇది నచ్చదు. చెడు ఫలితాలు గల్గుతాయి అందురు.

**16. IIII-** విజయ శాల - నాల్గుదిక్కులందును ద్వారాలు వసారాలు ఉండును
ఏదిక్కునందైనను సింహద్వారాన్ని ఏర్పాటు చేసుకొనవచ్చును.

**ఫలము:** ఇది సర్వసంపదలను అనుగ్రహిస్తుంది.

**గమనిక:** ఆధునికులు తూర్పు ఉత్తరాలలోని వసారాల కంటె - దక్షిణ పశ్చిమ వసారాలు కొంత ఎత్తుగా ఉండవలయును అంటారు. ఇందును నైరుతి మూల అన్నింటి కంటె ఎత్తుగా ఉండవలయును అంటారు.

**సమీక్షా**

ఈ పదునారింటిలో - ధాన్య - జయ - కాంత - మనోరమ - సుముఖ - సుపక్ష - ధన - విపుల - విజయ నామములైన తొమ్మిది - అలిందశాలలు శుభకరములు అని పూర్వశాస్త్రకారుల భావము. ఆధునికులు దక్షిణ పశ్చిమములు ఎత్తుగా ఉండవలయును అందురు గాన తూర్పున వసారా గల్గిన ధాన్యశాల విషయంలో వారికి ఎలాంటి విప్రతిపత్తియును ఉండదు. ధాన్య శాలనే ధన్యశాల అనియు అందురు. **IUUI** - అని దాని ప్రస్తారము ఇక తక్కిన వాటిలో - ఇవి సమ్మతాలు అగును. కాన్తము - **IUIU** - తూర్పు పడమరలు వసారాల గలది. సుపక్షము - **UIUI** - దక్షిణోత్తరములు పంచగలది. ఇది పైకప్పు గల్గిన పంచగా ఉండవలయును. ఉత్తరం కంటె దక్షిణం ఎత్తుగా ఉండవలయును. విజయము - **1111** - నాలుగు దిక్కుల వసారాలు గలది దక్షిణ పశ్చిమాలు ఎత్తు ఉండవలయును.

ఇట్లు తెల్పుటకు ఆధారాలు తమ అనుభవాలే అని ఈ ఆధునికులు అందురు. పాఠకుల సౌలభ్యానికై - ఈ నాల్గింటికి ఉదాహరణముగా పటములు వ్రాయుచున్నాను. వీటి సహాయంతో తక్కిన వాటిని ఊహింపగలరు.

ఉదా: 1. ధన్యశాల (ధాన్యశాల) **IUUU** - ప్రస్తారము


ఉత్తరము
రాజ మార్గము
కాంపౌండు
ముఖ్యగృహము
వసారా
పశ్చిమము
తూర్పు
దక్షిణము

2. కాంతశాల - **IUIU**


ఉత్తరము
కాంపౌండు
కాంపౌండు
వసారా
ముఖ్యగృహము
వసారా
పశ్చిమము
తూర్పు
దక్షిణము

3. సుపక్షశాల - UIUI




4. విజయశాల - 1111



ఈ పంచలు స్తంభాలు గలవిగాను. అందువలన పైకప్పు గలవి గాను ఉన్నచో - పంచలలో పార్శ్వములందు గదులు నిర్మిస్తారు. ముఖద్వారానికి ఇరు ప్రక్కలను స్తంభాల పర్యంతము అరుగులు నిర్మిస్తారు. ఈ పైకప్పు గల్గిన పంచకులేక వసారాకు - మరలనొక వాలు వసారాయును కొన్నియెడల స్థలాన్ని బట్టి ఏర్పాటు చేస్తారు.

**గమనిక:** ఈ విషయాలలో వాస్తువేత్తలను సంప్రదించడం శుభము.

**వసారా విషయములో ముఖ్య విషయములు కొన్ని:-**

1. ప్రధానమైన ఇంటికి పంచను లేక వసారాను గాని ఏదో ఒక దిక్కునందు మాత్రమే నిర్మింపదలచినచో ముఖద్వార భాగమునందు గానీ లేక ముఖద్వారానికి కుడి భాగమునందు గాని నిర్మింపవచ్చును. వెనుక భాగమునందును, ఎడమ భాగమునందును నిర్మింపరాదు అని శాస్త్రకారుల భావము.

**ఇందులకు ప్రమాణము:**

శ్లో॥ ఏక్యోలిందస్తుకర్తవ్యో ముఖతో దక్షిణేనవా ।
ముఖే రాజప్రసాదాయ దక్షిణ్యేర్థ వివర్ధనః ॥

**భావము:** ఒక్క అలిందమును వేయదలచినచో ముఖద్వారం దిక్కున గాని కుడిప్రక్కన గాని వేయవలయును ముఖద్వారము దిక్కున వేసినచో రాజానుగ్రహము గల్గును కుడిప్రక్కన వేసినచో ధనవృద్ధిగల్గును.

**విశేషము:** తూర్పు ముఖద్వారము గల్గిన గృహానికి కుడి ప్రక్కన దక్షిణ దిక్కు అగును. దక్షిణమునందు వాలు వసారాను ఆధునిక వాస్తు రచయితలు ఏమాత్రం అంగీకరింపరు. కప్పుగల్గి ఇంటి ఎత్తుతో సమానంగానీ - కొంత అధికంగా గానీ ఉండవలయునని వారి భావం.

2. అలిందద్వయ విషయము
రెండు వసారాల - విషయము

అ. గృహానికి రెండు ప్రక్కలను అనగా కుడి ఎడమలు రెండు ప్రక్కలను రెండు వసారాలు వేయవచ్చును.

యస్యస్యాతామలిందేద్వౌగృహస్యోభయపార్శ్వయో।
ధనలాభం నిజానీయాత్తత్రప్రవేశే కుటుంబినః।

**భావము:** ఇంటి ముందు వసారా లేకపోయినను కుడి, ఎడమలు రెండు ప్రక్కలను వసారాలు వేసికొనవచ్చును. ఇందువలన గృహస్థునకు ధనలాభం గల్గును.

ఆ. రెండవ విధము

రెండు వసారాలు ముందు వెనుకలను సైతము వేయవచ్చును.

శ్లో॥ యస్యస్యాతామలిందేద్వావగ్రతఃపృష్ఠతస్తథా।
ధనధాన్యమవాప్నోతి సౌభాగ్యంచాపితద్గృహీ॥

**భావము:** ఇంటికి ముందు వెనుకల వరండాలు వేసినచో యజమానుడు ధనధాన్యసమృద్ధిని సౌభాగ్యమును పొందును.

౩. మూడవ విధము - (రెండువసారాలు) హలకాలిందము - నాగలివలె = రెండు అలిందములను - ఏదేని కోణమునందు కలిపి వేయువిధమును హలకాలిందము అందురు. ఇది వంపుగా వ్రాసిన ^ వలె ఉండును.

శ్లో॥ యస్యవాహాలకాలిందో ముఖతో దక్షిణేనవా।
రాజప్రాసాదైస్తత్స్వామీ ధనధాన్యైశ్చవర్ధతే॥

**భావము:** ఇంటికి అగ్ర భాగమునందలి వాలు వసారాను కుడిచేతి ప్రక్కన ఉండే వసారాతో చేర్చికట్టవచ్చును. రెండు కలిసిన కోణమునందు హలాకృతి - అనగా నాగలి ఆకృతి రావలయును (హలము: నాగలి)

**ఫలము:** ఇట్లున్నచో గృహస్వామికి రాజానుగ్రహము ధనధాన్యసమృద్ధియు గల్గును.

**వివరణ:** విరుద్ధముగా ముఖభాగమందలి వసారాను ఎడమచేతి దిక్కునందు చేర్చి హలకాలిందము నిర్మించినచో రాజక్రోధమును ధననష్టమును గల్గును అని తెలియదగును.

**సారాంశము:** ఒక్క అలిందము అయినచో అగ్రభాగాన గానీ కుడి ప్రక్కన గానీ వేయవచ్చును. ముఖభాగాలిందము రాజానుగ్రహమును కుడి ప్రక్కన ఉండే అలిందము ధనలాభమును గల్గిస్తాయి.

**విరుద్ధముగా:** ఒక్క అలిందము (వసారా) వెనుక ప్రక్కవేసినచో భార్యకు కీడును ఎడమప్రక్కన వేసినచో ధననాశమును గల్గుతాయి.

## 19. గృహప్రమాణము - గృహవిభాగము

ఇంటికై గ్రహించిన స్థలము సమచతురస్రముగానీ దీర్ఘ చతురస్రముగానీ వృత్తాకారముగా గానీ ఆయతముగా గానీ ఉండవచ్చును అని వెనుక గ్రహించినాము. మరియు అర్ధ వృత్తాకారాలు, త్రికోణాలు సైతం ఏవిధమైనవి గృహనిర్మాణానికి యోగ్యములు అగునో ప్రథమ భాగంలో చర్చించాను.

కొందరికి దీర్ఘచతురస్ర విషయంలో సందేహాలు గల్గుతుంటాయి అనగా ఎంత దీర్ఘం అయినా ఉండవచ్చునా అని.

ఈ విషయంలో శాస్త్రకారుల చర్చలు అన్నిటినీ వ్రాయదలంచలేదు. ఇప్పటికే గ్రంథం చాలా పెరిగింది సారాంశము వ్రాస్తున్నాను.

వెడల్పునకు మూడు భాగాలు మించనంతవరకు పొడవు ఉండవచ్చును.

ఉదా: 10 గజాలు వెడల్పు ఉన్నచో 30 గజాల వరకు పొడవు ఉండవచ్చును. నివాస గృహాలకు లో కొలతలను స్వీకరింపవలయును. మధ్య గోడలు ఇంటియొక్క కొలతలలో చేరును.

కొందరు కొలతలు సరిపడనిచో వెలిగోడల యొక్క మధ్య భాగం నుండియు పరిగణన చేయవచ్చును అందురు.

సింహద్వారం ఉండే గోడయే ప్రధానంగా గృహం అగును. అందుచే అలిందమును కొలతలో చేర్చరాదు అనియు తలంపదగును. అలిందమునకు ద్వారము ఉండిననూ గోడ ఉండదు గనుక అది గృహభాగంలో చేరదు.

కొన్ని యెడల స్తంభాలతోడి అలిందము దానికి వంపు గల్గిన (వాలు గల్గిన) అలిందము ఇట్లు రెండు అలిందాలు అనగా వసారాలు ఉండును అయినను ఇవి ఇంటి కొలతలలో చేరవు.

ఆయాదులను సవరించేటప్పుడు కొన్ని అంగుళాలు పెరిగినను తగ్గిననూ లోపంలేదు అని తెలియదగును.

**గృహవిభాగము – పటము**




**వివరణము:** చిత్రము - తూర్పు ముఖద్వారం గల్గిన

1. పశ్చిమ గృహం
2. వరుసకు నాల్గు స్తంభాలు అనగా మూడు అంకణాలు గల్గిన యిల్లు.
3. గోడలలో పిల్లర్లు గాని స్తంభాలుగానీ లేవు. అని తలంచినచో కేవలము గోడల మీది గృహమే అగును కానీ అటుల స్తంభాలు లేని విధంగా గృహం నిర్మింపరాదు.
4. మధ్యన భారరహితమైన హాలుగా ఉంచబడింది.
5. ఈశాన్యాన దేవుని గది గలదు - తూర్పు ఈశాన్యమున చిన్న అరుగు ఏర్పాటు చేసి దేవుని పటం ఉంచదగును.
6. ఆగ్నేయంలో (పాకశాల) వంటగది గలదు తూర్పు ముఖంగా ఉండి వంట చేయదగును ద్వారము పైభాగాన్ని వదలి వంటగదిలో అటుకలు అలమారాలు ఏర్పాటు చేసికొనవచ్చును. వంటగదిలో గోడకు పై భాగాన మూషాకారమైన గవాక్షాన్ని వెలిదిశగా అమర్చవలెను. దాని ద్వారా గాలి వచ్చుటకు, పోవుటకు వీలు అగును.
7. దక్షిణాన వంటగది ప్రక్కన భోజనశాలను ఏర్పాటు చేసికొనదగును. తూర్పు ముఖంగా ఉంచి భుజించడం ఆరోగ్యదాయకము.

8. తర్వాత పడకగదియు దాని తర్వాత నైరుతి కోణంలో స్నానపుగది మరియు శౌచాలయము (లెట్రిన్) గలవు మలమూత్ర విసర్జన అనేది ఉత్తరముఖముగా గానీ - దక్షిణ ముఖంగాని కూర్చుండి చేయుటకు తగినట్లుగా ఏర్పాటు ఉండవలయును.

9. నడుమ బ్రహ్మస్థానములో గాని పశ్చిమాన గదిలో గానీ పిల్లలు చదువుకొనవచ్చును. తూర్పు ముఖంగా ఉండి పఠించినచో త్వరలో విద్య వచ్చును అని శాస్త్రము.

10. అవసరం అయినచో వాయువ్య కోణమునందును స్నానగృహాన్ని - శౌచాలయాన్ని ఏర్పాటుచేసి కొనదగును. అవసరం లేనిచో సామానుల గదిగా గానీ - శయనగృహంగా గాని వాడవచ్చును.

11. వాయవ్యకోణమున ప్రక్కన ఉత్తరమున ఇంకొక పడక గదిగలదు. అది ఉత్తర వాయువ్యము గనుక పడక గది చేసికొనవచ్చును. లేక సామానులు ఉంచే గదిగా గాని అతిధుల గదిగా గాని ఉపయోగింపవచ్చును.

12. దానికి పైన దేవుని గదికి దగ్గర ఉత్తరమున చిన్నగది గలదు అందు ధనము బంగారు మొదలైన విలువైన వస్తువులు ఉంచే బీరువాలు ఉంచదగును. ఉత్తరాన బరువు ఉంచరాదు. అనే వాక్యాను అనుసరించి సంశయింపరాదు - ఉత్తరము కుబేరస్థానము - కుబేరుడు ధనపతి అగును. ఈశాన్యాన బ్రహ్మస్థానాన వాస్తు పురుషమర్మాంగాలయందు మాత్రమే బరువు ఉండరాదు అని శాస్త్రము. మరియు ఉంచెడి బరువులును గోడల స్తంభాలు మొదలైన గృహ ద్రవ్యాలే గాని బీరువాలు పెట్టెలు బియ్యము మొదలైనవి గాదు అని గ్రహింపదగును.

13. ఈశాన్యవిషయం తెలుపబడింది.

14. పైకి పోవడానికి సోపానాలను ముఖద్వారానికి దక్షిణమున గాని నడుమ బ్రహ్మస్థానంలో దక్షిణమునగానీ వాస్తు వేధలేని విధంగా నిర్మింపవచ్చును. లేక ఏదేని గది నుండియు ఏర్పాటు చేసికొనవచ్చును.

15. ద్వారాలు - స్థూలంగా చూపబడినాయి వాస్తు శాస్త్రజ్ఞుల సలహాలు పొందడం శుభము.

16. పై పటము సామాన్యమైన గృహము పెద్ద భవంతులకు అనేకమైన గదులు ఉండును. సింహద్వారానికి ముందు అలిందము అనగా వసారా ఉండును.

అన్నిటిని ఈ స్థూల విషయాలను దృష్టిలో ఉంచుకొని గృహవిభజన చేయుదగును. ఇది స్థూలముగా చేయబడిన విభాగను.

## ౨౦. స్తంభములు - దూలములు

స్తంభములు, దూలములు, కిటకీలు, ద్వారాలు, సరిసంఖ్యలో ఉండవలయును. అలమారాలను సరిసంఖ్యలో ఉండడం శుభం అని కొందరు అందురు. ద్వారానికి ఎదురుగా వస్తువులు అగపడేటట్లు అలమారాలు ఉండరాదు. అందుచే దృష్టిదోషం గల్గుతుంది.

స్తంభ సంధులు మాత్రము బేసిగా ఉండవలయును స్తంభసంధి భాగమును అంకణము అందురు.

2-4-6-8-10-12-14-16 మొదలైనవి సరిసంఖ్యలు

1-3-4-7-9-11-13-15 మొదలైనవి బేసి సంఖ్యలు అగును కాని కొందరు 10-20-30-40 మొదలైన సున్నతో సరిసంఖ్యలు ఉండరాదు అందురు. అటుల అనుటకు తగిన ప్రమాణము లేదు.

అయుగ్మాఃపంక్తయస్త్రయుగ్మాస్తంభాదయః స్మృతాః

**భావము:** అంకణములు బేసి అంకెలో ఉండును స్తంభాలు, దూలాలు మొదలైనవి సరిసంఖ్యలో ఉండును అని మాత్రమే గలదు.

ప్రతివిషయాన్ని అన్వయ వ్యతిరేక విధాలుగా స్ఫుటంగా వివరించే శాస్త్రకారులు సున్నతోడి అంకెకు సరిసంఖ్యగా గణనలేనిచో

"శూన్యాంకేనయుతాయేస్యుః సమాంకానభవన్తితే"

**భావము:** సున్నతోడి అంకెలు - సరి అంకెలు గావు అని రచింపలేరా. ప్రసిద్ధమైన ఏకాశీతి పదవాస్తువు నందు రేఖలు పది అని అందరెరుంగుదురు.

ఇక పదిస్తంభాలు - పది దూలాలు ఇత్యాదిగా నిర్మించిన ప్రాచీన గృహాలలోని వారు శుభంగానే ఉన్నారు. దేవాలయాల నిర్మాణములందు ఈ సంఖ్యానియమములేదు. మనుష్య నివాసములకు మాత్రమే ఈ నియమం గలదు.

స్తంభములు, దూలములు వరుస తప్పరాదు. కఱ్ఱస్తంభములు అయినచో మొదలు క్రిందుగాను కొనలుపైకి ఉండవలయును అటులనే కఱ్ఱదూలములైనచో మొదళ్లు పడమటికి గాని దక్షిణానికి ఉండవలయును. కొనల తూర్పునకుగాని ఉత్తరానికి గాని ఉండవలయును. సిమెంటు స్తంభాలకును దూలాలకును మొదలు అని చివర అని లేదు గనుక ఈ నియమంతో అవసరంలేదు కేవలం రాతిస్తంభాలు రాతి దూలాల విషయంలో ఈ నియమాన్ని శిలావేత్తలైన శిల్పులు గుర్తింపగలరు.

## 1. స్తంభములు ఉంచకూడని స్థలములు

గృహమునకు గ్రహింపబడిన స్థలమునందు ఈశాన్యము నుండి నైరుతికి సూత్రము పట్టవలయును. అటులనే ఆగ్నేయమునుండి వాయవ్యమునకు సూత్రమును పట్టవలయును మధ్యభాగము అనగా సూత్రద్వయసంధిస్థలము బ్రహ్మ భాగము అగును.

బ్రహ్మస్థానమునందు గాని సూత్రములను బట్టి విభాగముచేయబడిన వాస్తుపురుషాంగములందు వేధ గల్గని విధంగా స్తంభాదులను ఉంచవలయును.

బ్రహ్మస్థానమునందు గాక తక్కిన స్థలములందు వాస్తువేధా, దోషము స్తంభముల విషయమున గల్గునట్లు దోచినచో స్తంభమధ్య భాగమునకు 51/2 అంగుళములు తప్పించినచో వేధాదోషము తొలగుననియు వాస్తుశాస్త్రకారులు అందురు. స్తంభముల విషయమున కృష్ణవాస్తు కారుని ఈ పద్యము చదవండి.

**"కంభములు లేక నిలయంబు గట్టరాదు**
**కంభములు చాలు దప్పిన కంబసూడు**
**బేసిదంతెలు మూలము బెరయవలయు**
**పొరుగు కొట్టంబు వెనుబోటి పొసగదధిప"**

**భావము:** కంబాలు లేని విధంగా ఇల్లు కట్టరాదు, కంబాలు వరుస తప్పరాదు. వరుస దప్పినచో కంబసూడులనే కీడు గల్గును. దూలములును అటులనే సరిగా ఉండవలయును. దంతెలు మాత్రం బేసిగా ఉండుట శుభములు ఇక రాతిగోడలైనచో వెనుబోటు దూలాలకు రాకూడదు.

ఈ విషయము స్ఫుటంగా అర్థము అగుటకై బొమ్మగీయుచున్నాను.

ఉదా:




**వివరణ:** ఇచ్చటి దూలములు మూలలు తగులుచు పోటుగా ఉన్నవి. స్తంభాలు సరిగా ఉన్నచో దూలాలు పోటు సైతం గల్గదు. రాతి గోడలతో గృహాలను నిర్మించేటప్పుడు ముందుగా నిర్మించిన గృహాలకు - స్తంభాలు దూలాలు గోడలు మున్నగునవి ఎటుల ఉన్నది, జాగ్రత్తగా గమనింపవలయును అటుల గుర్తించి అందుకు అనుగుణంగా దోషరహితంగా తన గృహాన్ని నిర్మింపదగును.

స్తంభాలకు గోతులు త్రవ్వునపుడు కాలసర్పగతిని సైతం గమనింపవలయును. ఇది జ్యోతిశ్శాస్త్రసంబంధమైన విషయము, వాస్తువునందును, జ్యోతిషమునందును. అనుభవజ్ఞులైన పండితులను సంప్రదించి - స్తంభమునుంచే గోతిని గాని పిల్లర్లు వేసే గోతిని - శుభముహూర్తమున ప్రారంభించి శుభములను పొందురుగాక.

## 21. కాలసర్పగమన విధానము

'సాక్షరా' శబ్దాన్ని వ్యత్యస్తముగా అనగా వెనుక నుండి చదివినచో - రాక్షసా అనే శబ్దం ఏర్పడుతుంది. అందువల్లనే.

'సాక్షరా విపరీతాశ్చేత్ రాక్షసావేవ కేవలమ్'

**భావము:** సాక్షరులు విపరీతులైనచో సాక్షరా శబ్దం రాక్షసా అయినట్లు రాక్షసులు అగుదురు. అనే సూక్తి ఏర్పడింది. అనగా సామాన్యమూర్ఖుని కంటె విద్వాంసుడైన మూర్ఖుడు అధిక భయంకరుడు రాక్షసుడు అని సారాంశము.

**ప్రస్తుతాంశము:** స్తభ్నాతి = నిరోధయతీతస్తంభః - స్తభురోధనే క్ర్యాదికము. స్తంభింపజేయునది కనుక ఇది స్తంభము అని వైయాకరణులు స్తంభశబ్దాన్ని నిర్వచిస్తారు. సాక్షర శబ్దంవలెనే వాస్తువేధో దోషరహితంగా శుభసమయంలో ఇది స్థాపితమైనచో అశుభాన్ని నిరోధించి గృహస్థునకు ఐహికాముష్మిక శుభాలను గల్గిస్తుంది. అందుకు విరుద్ధంగా వాస్తు వేధాస్థలంలో కాలసర్పదోషయుత ప్రదేశంలో స్థాపితమైనచో రాక్షసరూపమై బహువిధ కష్టనష్టాలను గల్గించి జీవితాన్ని నరకంజేస్తుంది. అన్నీ సరిగా ఉండినచో శుభాలు గల్గుతాయి. ఏ ఒక్కటి సరిగా లేకపోయినను కల్గవలసిన శుభము ప్రతికూలిస్తుంది. తక్కిన వంట సామగ్రి ఘనంగా ప్రశస్తంగా ఉన్ననూ ఉప్పులేనిచో పాకము సరిగా కుదురదుగదా అందుచే ముహూర్తబలము సైతము ముఖ్యంగా తలపబడును. కనుక స్తంభప్రతిష్ఠకు ముఖ్యమైన కాలసర్పగతిని సంగ్రహంగా పరిచయం చేస్తున్నాను. కృష్ణ వాస్తువునందలి ఈ పద్యమును చదవండి.

సీ॥ కాలసర్పము లెక్కగా సంచరించును
రహిమించు వృషభాది - రాశులందు
హరదిశశీర్షంబు - ననిలదిఙ్మధ్యంబు
అసురదిక్పుచ్ఛమై - అలరుచుండు
సింహత్రయంబున - శిరము వాయువునందు
అసురదిక్పుచ్ఛమై - అగ్నిపుచ్ఛ
మగు, అళిత్రయంబున అపుర దిక్శిరమును
అగ్నిదిఙ్మధ్యంబు - హరుని దిశను

గీ॥ పుచ్ఛమగు కలశత్రయ - మునను వహ్ని
మూలతలయుండు మధ్యంబు - ఫాలనయను
దెసను, పుచ్ఛంబు వాయువు - దెసఁజెలంగు
ఇట్టి గతులందుగ్రాహ్యంబు లెఱుగవలయు

కం॥ తలమీదఁద్రవ్వమృత్యువు
వలనొప్పగ వీపుమీద వచ్చును పీడల్
చలనంబు తోకమీదం
జెలువుగవిడుపైన దిశను - సిరులగు । కృష్ణా ॥

**భావము:** వృషభ, మిథున, కర్కాటక మాసములలో అనగా - ఇంగ్లీషు క్యాలెండరు ప్రకారము మే నెల 15 తేదీ నుండి ఆగస్టు నెల 17 తేదీ వరకు ఉండే మూడు నెలల కాలములో కాలసర్పమునకు ఈశాన్యమున తలయును. వాయవ్యమున నడుమును నైరుతి యందు తోకయును ఉండును. పిమ్మట అది పడమటికి జరుగును. సింహ - కన్యా తులామాసములందు అనగా ఆగస్టు 17 తేదీ నుండి నవంబరు 17 తేదీ వరకు ఉండే మూడు నెలల కాలంలో ఆ - కాలసర్పమునకు వాయవ్యమున తలయును. నైరుతిని నడుమును ఆగ్నేయములో తోకయును ఉండును. పిమ్మట వృశ్చిక - ధనుర్ - మకర మాసములందు అనగా నవంబరు 17 తేదీ నుండి ఫిబ్రవరి 13 తేదీ వరకు ఉండే మూడు నెలల కాలంలో ఆ సర్పము నైరుతి దిక్కున శిరమును ఆగ్నేయమందు నడుమును ఈశాన్యమునందు తోకయును గలదై యుండును. అటు మీదట కుంభ మీన - మేష మాసములలో అనగా ఫిబ్రవరి 13 తేదీ నుండి మే 15 తేదీ వరకు ఉండే మూడు నెలలకాలంలో ఆ సర్పము ఆగ్నేయమున తలయును. ఈశాన్యమునందు నడుమును వాయవ్యమున తోకయును కలదియై ఉండును. స్తంభమును ఉంచుటకు గాని పిల్లర్సు కొరకు గాని కాల సర్పము యొక్క తలమీద త్రవ్వినచో మరణభయము గల్గుతుంది. వీపున ద్రవ్వినచో పీడలు జనిస్తాయి. తోక మీద త్రవ్వినచో చలనము సంభవిస్తుంది. కాబట్టి కాలసర్ప గతిని తెలిసికొని. దాని తల వీపు తోక అనేవి. ఆ నెలయందు ఎచ్చట ఉండేది పెద్దలవలన తెలిసికొనవలయును. ఈ మూడు స్థలములను వదలి తక్కిన స్థలములందు స్తంభములను త్రవ్వినచో సంపదలు గల్గును. కాలసర్పము యొక్క గతి మారినప్పుడు అవసరాన్ని బట్టి తక్కిన స్థలాలో స్తంభాలకు గోతులు త్రవ్వ వచ్చును. శుభములు పొందదగును. ఈ విషయంలో శాస్త్రజ్ఞుల సలహాలు పొందడం శుభదాయకము.

ఇది

శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డి విరచితమైన వాస్తుకౌముదియందు వృక్షములు,దారులక్షణాలు, ద్వారలక్షణాలు గోడల నిర్మాణములు, అటకలు, స్తంభాదుల విషయములతో కూడిన తృతీయభాగము సమాప్తము.

——:——